

తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

ఆగష్టు 2015 వెల రూ.5/-

## తిరుమల శ్రీవారి పవిత్రోత్సవం

24-08-2015 నుండి 27-08-2015 వరకు



# తిరుమల

## శ్రీ వేంకటేశ్వరస్వామివారి వార్షిక బ్రహ్మోత్సవాలు-2015.

### సెప్టెంబరు 15 నుండి 24 వరకు

| తేదీ | వారము | పగటి ఉత్సవం | రాత్రి ఉత్సవం |
|---|---|---|---|
| 15-09-2015 | మంగళవారం | -- | సేనాధిపతి ఉత్సవం, అంకురార్పణం. |
| 16-09-2015 | బుధవారం | వజ్రకవచాద్యాభరణాలతోబంగారుతిరుచ్చిఉత్సవం | ధ్వజారోహణం (సాయంత్రం) పెద్దశేషవాహనం. |
| 17-09-2015 | గురువారం | చిన్నశేషవాహనం | హంసవాహనం. |
| 18-09-2015 | శుక్రవారం | సింహవాహనం | ముత్యపుపందిరివాహనం. |
| 19-09-2015 | శనివారం | కల్పవృక్షవాహనం | సర్వభూపాలవాహనం. |
| 20-09-2015 | ఆదివారం | పల్లకీలో మోహినీ అవతారోత్సవం | గరుడవాహనం. |
| 21-09-2015 | సోమవారం | హనుమద్వాహనం, సాయంత్రం॥ వసంతోత్సవం సువర్ణరథరంగ డోలోత్సవము | గజవాహనం. |
| 22-09-2015 | మంగళవారం | సూర్యప్రభవాహనం | చంద్రప్రభవాహనం. |
| 23-09-2015 | బుధవారం | రథోత్సవం | అశ్వవాహనం. |
| 24-09-2015 | గురువారం | పల్లకీ ఉత్సవం, తీర్థవారి అవభృథోత్సవం, చక్రస్నానం | ధ్వజావరోహణం. |

దేవ నీవు గల్పించిన - తెరువు లివి
నీవారైన వారి - నేరుపు లివి.

పరమశాంతునకుఁ - బాపము రాదు
విరతి గలవానికి - వెరపు లేదు,
గురుసేవారతునకుఁ - గోపము రాదు
ధర సత్యవిదునకుఁ - దప్పు లేదు.

పుట్టు బ్రహ్మచారికి - బుద్ధి చెడదు
అట్టె ఆసలేనివారికి - అలపు లేదు,
తొట్టిన సుజ్ఞానికి - దుఃఖము లేదు
గట్టియైన మౌనికి - కలహమే లేదు.

సమచిత్తునకును - చంచలము గాదు
విమలాచారునకు - వెలితి లేదు,
నెమకి శ్రీ వేంకటేశ - నీదాసులై కొల్చి
భ్రమయనివారికి - భారము లేదు.

(2-307)





మిక్కిలి శాంతుడైన వానికి పాపం అంటదు. సుఖాలలో విరక్తి గలవానికి భయమనేది లేదు. గురుసేవలో ఆసక్తుడైన వానికి కోపంరాదు. సత్యస్వరూపం తెలిసిన సుజ్ఞానికి ఎట్టి దోషాలుఅంటవు. పుట్టింది మొదలు బ్రహ్మచర్యం పాటించు శుద్ధాత్ముని బుద్ధి పెడత్రోవ పట్టదు. ఆశను తుదముట్టించినవానికి ఏ విధమైన శ్రమ ఉండదు. పరిపూర్ణుడైన సుజ్ఞానికి దుఃఖం లేదు. దృఢంగా మౌనాన్ని పాటించే మునికి ఎప్పుడూ ఎవరితోను కలహం లేదు. శీతోష్ణాలు సుఖదుఃఖాలు జయాపజయాలు మున్నగు వాటిలో సమచిత్తత కలవానికి మనశ్చాంచల్యం ఉండదు. నిర్మలమైన ఆచారం పాటించువారికి ఎట్టి లోపమును లేదు. శ్రీ వేంకటేశ్వర నిన్ను అన్వేషించి నీకు దాసులై నిన్ను సేవించి సంసార భ్రాంతికిలోను కానివారికి అంతా సుఖమయమేగాని భారము గొల్పునది ఏది లేదు.




## అమూల్యం

పుష్పార్చనలో వివిధరకాల పూలు ఏరి దేవునికి సమర్పించడం గురించి బాగా వివరించారు. ధర్మం గురించి కె.యస్.శాంతలక్ష్మి గారు విపులంగా తెలియ జేశారు. పాకాల సుబ్రహ్మణ్యం ఆలయ వ్యాసం బాగుంది. పిబరే రామరసం చక్కని విషయాలు తెలియజేసింది. ఇంత అమూల్యమైన రచనలను అందజేస్తున్న సప్తగిరికి మా ధన్యవాదాలు.

*– మద్రి వెంకటమహాలక్ష్మి, కృష్ణాజిల్లా*

## చక్కగా ఉంది.

జూన్ నెల పత్రిక ప్రతిపేజి బాగుంది. పుష్కరస్నానంతో తాపాలు, పాపాలు హరిస్తాయని చక్కగా తెలియజేశారు. 'సందేహాలు–సమాధానాలు' లో ఊర్ధ్వపుండ్రాలు, తిర్యక్‌పుండ్రాలు అంటే ఏమిటో తెలియజేశారు. కుబేరునివృత్తాంతంలో ఎవరికీ తెలియని విషయాలను తెలిపి మమ్మల్ని ధన్యులు చేశారు. పుష్పాల గురించి వాటి పూజా ఫలాల గురించి తెలిపి మమ్మల్ని ఆశ్చర్యపరిచారు. ఎవరికీ తెలియని సాలగ్రామరకాలు తెలిపి భగవంతుడివైపు నడిపించారు.

*– మాదేటి శంకరరావు, సాలూరు*

## అభ్యర్థన

భక్తవరుల ప్రసాదమై భాసిల్లగా వెంకటేశుని లీలలతో వేడ్కమీద తెలుగు సప్తగిరి ప్రతులకై మనసు పడుతూ రండి కొనండి చందాలు కట్టరండి.

*– గంగరాజు మోహన్‌రావు, ఆవడి, చెన్నై*

## ధన్యవాదాలు

జూన్ 2015 సప్తగిరి మాసపత్రిక కన్నుల పండుగగా ఉంది. వ్యాసభాగవతం–అవతారిక వ్యాసం ఆలోచనాత్మకంగా ఉంది. వ్యాసమహర్షి చెప్పిన తీరును వివరించడం బాగుంది. సప్తగిరి మాసపత్రికను అంతర్జాలంలో అందిస్తున్నందుకు తి.తి.దేవస్థానం వారికి ధన్యవాదాలు.

*– డి. శ్రీనివాసదీక్షితులు, నరసరావుపేట.*

## సుందరం

స్వామి సన్నిధినుండి వెలువడుతున్న ప్రతిసంచిక సర్వాంగసుందరంగా ఉండి స్వామిని క్రమం తప్పకుండా దర్శించుకునేలా చేస్తున్నది. ఈ పత్రిక సాహిత్య, పురాణ, విజ్ఞాన సర్వస్వం. సినారె గారి మందారమకరందాలు బాగుంది. శ్రీఅప్పజోడు వెంకటసుబ్బయ్యగారి దారిదీపాలు ఆలోచనాత్మకంగా ఉంది.

*– ఆర్. వేణుగోపాలరావు, విశాఖపట్నం.*

### 2015, సెప్టెంబరు నెలలో తిరుమల తిరుపతి దేవస్థానముల ఉత్సవ విశేషాలు

| | |
|---|---|
| 5 | శ్రీకృష్ణ జన్మాష్టమి |
| 6 | గోకులాష్టమి ఆస్థానం |
| 15 | తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవ అంకురార్పణ |
| 16 | వరాహ జయంతి, తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవప్రారంభం |
| 17 | వినాయక చవితి |
| 18 | ఋషి పంచమి |
| 20 | తిరుమల శ్రీవారి గరుడసేవ |
| 23 | తిరుమల శ్రీవారి రథోత్సవం |
| 25 | శ్రీవామన జయంతి |
| 26 | తిరుచానూరు శ్రీపద్మావతి తాయార్ల పవిత్రప్రతిష్ఠ |

# సప్తగిరి

## తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి : 46 ఆగస్టు, 2015 సంచిక : 3



website : www.tirumala.org, www.tirupati.org

24 గంటలు పనిచేసే
తిరుమల తిరుపతి దేవస్థానముల
కాల్ సెంటర్ ఫోన్ నెం.
0877 - 2277777, 2233333

ఈ సంచికలోని రచయితలఅభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. ప్రధానసంపాదకుడుగాని, తిరుమల తిరుపతి దేవస్థానంగాని వాటికి బాధ్యత వహించరు.

ముఖచిత్రం : ఉభయ దేవేరులతో శ్రీవారు
చివరిపుట : శ్రీవారి వజ్రభూషితచక్రం

వేంకటాద్రిసమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన ।
వేంకటేశసమో దేవో న భూతో న భవిష్యతి ॥



**పరమాత్మ సర్వమునకు అతీతుడు**


గౌరవ సంపాదకుడు :
డా॥ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు :
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు : డా॥ కె.రాధారమణ
ఉప సంపాదకురాలు : డా॥ అల్లాడి సంధ్య
ముద్రాపకురాలు : యమ్.గౌతమి, యమ్.బి.ఎ.,
ఉప కార్యనిర్వహణాధికారి,
(ప్రచురణలు & ముద్రణాలయం)
తి.తి.దే., తిరుపతి
డి.టి.పి. : ప్రధాన సంపాదకులవారి కార్యాలయం, తి.తి.దే., తిరుపతి
వర్ణచిత్ర పుటలు : పి.శివప్రసాద్



*వివరాలకు :*
ప్రధాన సంపాదకుడు,
సప్తగిరి, తి.తి.దేవస్థానములు,
తిరుపతి - 517 507.
ఫోను : 0877-2264543, 2264359



సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ.500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

సంపాదకీయం

# అంతర్జాలంలో సప్తగిరి

ప్రజలలో సత్ప్రవర్తన, సదాచారం, ధర్మాచరణం వంటి వాటిని ప్రేరేపించి ముందుకు నడిపించే విషయంలో ధార్మికపత్రికల స్థానం ప్రత్యేకం. అందులోను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురిస్తున్న **'సప్తగిరి'** ధార్మిక మాసపత్రిక స్థానం మరింత విశిష్టమైంది.

ప్రాచీనకాలంలో ప్రజలకు ఏ ధర్మసందేహం కలిగినా, ఏ పురాణం లేదా ఏ ఇతిహాసాన్ని గూర్చి ఆసక్తి కలిగినా మహర్షుల వద్దకో, ఆశ్రమాలకో, ధర్మపీఠాలవద్దకో వెళ్లి తెలుసుకునేవారు. కాని అనంతర కాలంలో ఆశ్రమాలు కనుమరుగయ్యాయి. ఈ యాంత్రికయుగంలో వేగంతో కూడిన మానవ జీవితంలో కలిగే ధర్మ సందేహాలను, ఆధ్యాత్మిక విషయాలను తెలుసుకోవడానికి – **సప్తగిరి** మాసపత్రిక అంతర్జాలం ద్వారా చదువుకునేందుకు పఠితలకొరకు సిద్ధమైంది.

'తి.తి.దేవస్థానం బులిటెన్' గా పిల్లకాలువగా ఆరంభమైన **'సప్తగిరి'** మాసపత్రిక కాలగమనంలో 5 వేర్వేరు పత్రికలుగా అవతరించి తెలుగు, తమిళం, కన్నడం, హిందీ, ఇంగ్లీషు భాషలలో ప్రచురింపబడుతున్నది. ఇటీవలి కాలంలో సంస్కృత భాషలో కూడా వెలువడుతోంది. ఒక ఆధ్యాత్మిక పత్రికను 46 సంవత్సరాలు నిరంతరాయంగా భక్తకోటికి అందించడం అంటే నిజంగా అబ్బురమే. దీనికి కారణం ఆ శ్రీనివాసుని కృప, యాజమాన్యానికి ఉన్న నిబద్ధత, మరీ ముఖ్యంగా పాఠకులైన మీ ఆదరణ కారణంగా సాధ్యమైందని చెప్పాలి. ఆ దిశలో నేడు నూతనంగా అంతర్జాలం ద్వారా చదువుకోవడంతోబాటు డౌన్‌లోడ్ చేసుకునే సౌలభ్యం, ఆన్‌లైన్ ద్వారా చందాలను కట్టే విధానానికి నాందీ పలుకుతున్నది.

భక్తులకు, పాఠకులకు తిరుమలేశుని గూర్చి శ్రీవారి ఆలయ సేవలు, ఉత్సవాలు, వసతి, ప్రయాణ సౌకర్యాల గూర్చి సవివరంగా తెలియజేయాలనే సంకల్పంతో ప్రారంభమైన **సప్తగిరి** మాసపత్రిక తన పరిధిని మరింత విస్తృతపరచుకొని భక్తులకు ఆధ్యాత్మిక సేవలను ప్రపంచవ్యాప్తంగా తెలుసుకునే విధంగా అంతర్జాలం ద్వారా పాఠకులకు మరింత దగ్గరవుతున్నది. వేదాలు, ఉపనిషత్తులు, ఇతర క్షేత్రాలు, దేవాలయాలు, భారత, భాగవత, రామాయణేతిహాసాలు, భగవద్గీతలకు సంబంధించిన అనేకానేక విశేషాలను, పిల్లలు, పెద్దలు, స్త్రీలు మెచ్చే బాలప్రబోధం, గృహలక్ష్మి వంటి శీర్షికలను సౌకర్యవంతంగా అందించడానికి అంతర్జాలం ద్వారా ముందడుగు వేస్తున్నది మీ (మా) **సప్తగిరి**. పత్రిక ముద్రణ విషయంలో వివిధ శీర్షికలు, ముఖపత్ర చిత్రాలు ఇంకా ఇలాంటి అనేక అంశాలతో సప్తగిరిని సర్వాంగసుందరంగా తీర్చిదిద్దాలని తద్వారా పాఠకులకు భక్తులకు సేవ చెయ్యాలనే ఉదాత్త లక్ష్యంతో తి.తి.దేవస్థానం యాజమాన్యం నిరంతరం పురోగమిస్తూనే ఉంది. అందుకు ఉదాహరణే నేటి అంతర్జాలం, ఆన్‌లైన్ పద్ధతులు.

ప్రపంచవ్యాప్తంగా అంతర్జాలంలో వస్తున్న **సప్తగిరిని** ఉచితంగా భక్తులు పాఠకులు ఇకపై తమతమ గృహాలనుండీ, ఏ చోటునుండైనా అంతర్జాలం ద్వారా చదివి శ్రీవారి ఆశీస్సులు పొందే మహద్భాగ్యాన్ని తి.తి.దేవస్థానం వారు కల్పిస్తున్నారు. ఎప్పటిలాగే భక్తులు, పాఠకులు తమ సహకారం, సలహాలు, సూచనలు అమూల్య అభిప్రాయాలు సదా అందించాలని కోరుతూ, వాటిని ఆదరంతో స్వీకరిస్తామని, పాటిస్తామని తెలియజేస్తున్నాం.

శ్రీవేంకటేశ్వరభక్తి ప్రచారమే ప్రధాన ధ్యేయంగా ధర్మప్రచారమే ఊపిరిగా ప్రవర్ధిల్లుతున్న మా (మీ) **సప్తగిరి** మాసపత్రిక లక్ష్యంలో మీరు అందరు పాలుపంచుకోవాల్సిందిగా గతంలో కంటే ఇంకా ఉత్సాహంగా ప్రోత్సాహాన్ని అందించవల్సిందిగా కోరుతూ, మీకందరికి ఇహపరసౌఖ్యాలను ప్రసాదించాలని 'సప్తగిరీశు' ని ప్రార్థిస్తున్నాం!



# వైఖానసం - విశిష్టత



ప్రొ॥ వేదాన్తం శ్రీవిష్ణుభట్టాచార్యులు, తిరుపతి, 9490741414

**శ్రౌతస్మార్తాదికం కర్మ**
**నిఖిలం యేన సూత్రితమ్,**
**తస్మైసమస్త వేదార్థ -**
**విదే విఖనసే నమః.**

భగవంతుని ఉచ్ఛ్వాసనిశ్వాసములైన వేదాలు ప్రధానముగా భగవత్ప్రాప్తికి దోహదమౌతాయి. అవి ఋగ్ యజుస్సామ ఆథర్వణములని నాలుగు విధాలు. ఇవి ఒక్కొక్కటి సంహిత–బ్రాహ్మణ–ఆరణ్యక–ఉపనిషత్తులని వర్గీకరించబడ్డాయి. అందులోని సంహితలు మూలమంత్రాలు. వీటిని ఆధారం చేసుకొని కర్మ ప్రతిపాదకములైన కల్పసూత్రాలు, యాగప్రతిపాదకములైన జైమిన్యాది శాస్త్రాలు ఆవిర్భవించాయి. కల్పసూత్రాలలో మానవుడు జన్మించింది మొదలు మరణాన్తం వరకు ఏఏ సమయంలో ఏఏ కర్మలు ఆచరించాలనే విధి నిబంధన వాక్యాలు, వాటి మంత్రప్రయోగ విధానాలు ప్రతిపాదింపబడినవి. ఒక్కొక్క వేదానికి అనేకాలైన కల్పసూత్రాలు రచింపబడినట్లు వేదవాఙ్మయం స్పష్టపరుస్తున్నది. దానిని పరిశీలించి కృష్ణయజుర్వేదానికి సంబంధించినదే 'వైఖానస కల్పసూత్రమ' ని శౌనకుడు తన చరణవ్యూహంలో నిర్దేశించాడు. ఆ వైఖానస కల్పసూత్రకర్త విఖనసుడు. ఆ విఖనసుడే మహర్షి అని చతుర్ముఖబ్రహ్మ అని ఆయా సంహితలలో చెప్పబడుతున్నది. విఖనః, విఖనాః , విఖనసః అనేవి ఆ మహర్షికి నామాంతరాలు. శ్రీమన్నారాయణుడు తనను అర్చించడానికి ఈ మునిపుంగవుని బ్రహ్మచే సృజింప చేసుకొన్నట్లు నామ వ్యుత్పత్తి ఆయా అధికరణములలో వివరింపబడింది. ఆ విఖనోముని ప్రణీత కల్పసూత్రం వైఖానస ఆగమశాస్త్రానికి మూలభూతమని, ఆ ఆగమము వైదికమని, కల్పోక్తవానప్రస్థాశ్రమ విధానం సర్వమహర్షి సమ్మతమని ఆయా ప్రామాణికుల భావన.

## పరిచయం

విఖనసమహర్షి తన కల్పసూత్రములో విష్ణ్వర్చనావిధానాన్ని షోడశోపచారాలతో వివరించి ఆ విధంగా ఆచరించిన విష్ణుపదం ప్రవేశిస్తారని వివరించారు. దానిని ప్రధానంగా గ్రహించి భృగు, మరీచి, అత్రి, కశ్యపులు కర్షణం మొదలుకొని ప్రతిష్ఠ, అర్చన, స్నపన, ఉత్సవ, ప్రాయశ్చిత్త, విశేష అర్చనాదులనేకాక దుర్భిక్ష అనావృష్టి పరచక్రభయాది ఉపద్రవ సమయాలలో చేయవలసిన విధి విధానాలు అధికార, సంహిత, తంత్ర, కాండములనెడి వారివారి ఆగమ గ్రంథాలలో చక్కగా వివరించారు.



ఆగష్టు 29 శ్రీవిఖనస జయంతి





## జన్యజనక సంబంధం

వైఖానస కల్పసూత్రంలో స్మార్తసూత్రం, చతుర్థప్రశ్నలో, దశమఖండ ఆరంభంగా ద్వాదశఖండ వరకు గల ఇరవైఏడు సూత్రాలలో ప్రతిష్ఠాపూర్వకఅర్చనావిధి సంగ్రహంగా చెప్పబడింది. దానిలో "అతో దేవాదినా ఇతి దేవం ప్రణమ్య" అని ప్రారంభించి. "ప్రణామం కుర్యాత్" అనేంతవరకు ఉన్న ఏడు సూత్రాలలో చెప్పబడిన అర్చనావిధిని పరిశీలిస్తే ఆవాహన, ఉద్వాసనలు లేక ఉపచారాల సంఖ్య పదహారుగా నిర్ణయింపబడింది. దీనిని ఆధారంగా చేసుకొని ఆగమ సంహితలలో కూడా ఉపచారాలకు ఆదియందు ప్రధానముగా ఆవాహనం, అంత్యమున ఉద్వాసనం సామాన్యంగా స్వీకరించాలని సూచింపబడింది. ఉపచారాలసంఖ్య నిర్దుష్టముగా చేర్చబడలేదు. ఈ ప్రమాణాన్ని బట్టి కల్పఆగమముల జన్యజనక సంబంధం అవగతమౌతుంది. కల్పసూత్రంలో చెప్పబడిన గ్రహశాన్తి విధానానికి ప్రతీకగా ఆగమంలో అద్భుతశాన్తి వివరింపబడింది. అందు ప్రధాన దేవతలు నవగ్రహాలు, ఈ గ్రహస్థానాలు పరిశీలించినపుడు కల్పసూత్రములందు చెప్పబడిన విధానమే ఆగమములందు కూడా నిర్ణయించబడిందని తెలుస్తున్నది.

## ఆరాధనం వైదికం

వైఖానస కల్పసూత్రము అష్టమ ప్రశ్నలో గృహస్థ భేదాన్ని వర్ణించు సందర్భంలో ఒకసూత్రం చెప్పబడింది. దానియందు ప్రతినిత్యం పంచ మహాయజ్ఞాలు ఆచరించి, ఆయా కాలాలలో సప్తపాక యజ్ఞాలను, పక్షపర్వాలలో దర్శపూర్ణమాసం, ప్రతి నాలుగు మాసాలకు చాతుర్మాస్యం, ప్రతి ఆరు మాసాలకు పశుబంధం, ప్రతి సంవత్సరము సోమయాగం విధిగా గృహస్థుడు ఆచరించాలని చెప్పబడింది (8-5-40). ఇదే అమూర్తారాధనం. ఈ చెప్పబడిన దానిని దృష్టిలోఉంచుకొని ఆగమశాస్త్రంలో అగ్ని ఆధానానికి ప్రతీకగా విగ్రహప్రతిష్ఠ, పంచమహాయజ్ఞాలకు ప్రతీకగా పంచ



బేరార్చన, దర్శపూర్ణమాసానికి ప్రతీకగా పక్షోత్సవం, చాతుర్మాస్యముల స్థానమున విశేష పూజలు, సోమయాగానికి ప్రతీకగా బ్రహ్మోత్సవాలు (కాలోత్సవము) అని వర్ణింపబడింది (సమూర్త అర్చనాధికరణం 27-1,5). ఈ అంశముచే వైఖానసారాధనము వైదికమని నిర్ధారింపబడుతున్నది.

## క్లేశ విరహం

"ప్రవఃపాన్థమంధసో ధియాయతే మహేశూరాయ విష్ణవే చార్చత'' అనెడి ఋగ్వేద మన్త్రమునందలి ''విష్ణవే చార్చత" అను పదాన్ని బట్టి అర్చనావిధానానికి వేదమెంత ప్రాముఖ్యత ఇచ్చిఉందో అనే విషయాన్ని తెలియచేసేందుకు ఈ మంత్రాన్ని ప్రతిపాదించి, ఆపైన అర్ఘ్యాదులతో పురుషసూక్త మంత్రాలతో పూజిస్తే విష్ణుపద ప్రాప్తి అని వివరించడమేకాక అర్చనా విధానానికి శ్రుతి మూలకత్వము కూడా మరీచి సంహితలో వర్ణింపబడింది. అట్లే అమూర్త సమూర్త విధానం వివరించడంతోబాటు అందులో అమూర్తమనగా అగ్నియందు హోమము చేయుట అని, మూర్తిబింబాన్ని పూజించుటే సమూర్తమని ఇదే శ్రేష్ఠమని వివరింపబడింది. ప్రతిష్ఠావిధానంలో సర్వవ్యాపకుడైన పరమాత్మకు ఆవాహన ఉద్వాసన అయుక్తమైనప్పటికి అరణ్యంలో వ్యాప్తమైన వహ్నిమథించుటచే సన్నిహితమైనట్లు, ధ్యానమథనంచే భక్తునకు విష్ణువు సన్నిహితుడు కాగలడని వివరించి భక్తసౌలభ్యముకొరకై ఆవాహన క్రమం వివరంగా చెప్పబడింది.



పరమాత్ముని ఉత్సవ విధానంలో శక్తికొలది చేసే వాహనసేవలను గ్రామంలోని ప్రజలు సేవించిన వారికి పదే పదే యజ్ఞఫలము లభిస్తుందని, ఇది భృగ్వాదుల అభిప్రాయమని మరీచి, తన సంహితలోనే తెలిపాడు. దీనిని పరిశీలించినపుడు ఈ ఆగమశాస్త్రానికి ఇందులోని సంహితాన్తరములతో (భృగు, మరీచి, అత్రి, కాశ్యపుల ఒక్కొక్కరి గ్రంథములందు వేరొకరి గ్రంథములతో) వివాదము లేదని "అనుక్తమన్యతో గ్రాహ్యం" అను న్యాయముచే ఒక సంహితలో చెప్పబడని విషయమును వేరొక సంహితనుండి గ్రహించవచ్చని తెలుస్తున్నది. కావున ఈ వైఖానస ఆగమశాస్త్రం క్లేశవిరహం, సర్వజన సమ్మతం గౌరవాస్పదం అనుటలో సందేహము లేదు.

## వానప్రస్థాశ్రమ విధి

మానవుని ఆచరణ ధర్మాలను బట్టి ఆశ్రమ ధర్మాలు నాలుగు విధాలుగా వైఖానస కల్పసూత్రంలో వర్ణింపబడినవి. అవి బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్యాసం అనేవి. ఉపనయనమైంది మొదలు గురుశుశ్రూషచే ఆయా ధర్మాలు ఆచరించుచూ పన్నెండు సంవత్సరాలు కానీ, ఇరువది సంవత్సరాలు కానీ గురుకులంలో ఉండి వేదాధ్యయనం చేయడం బ్రహ్మచర్యమంటారు. పాణిగ్రహణప్రభృతి పత్నితో యజ్ఞ యాగముల ఆచరిస్తూ పుత్రపౌత్రాది సంతానానికి దోహదభూతమౌతూ ఆయా ధర్మాలని ఆచరించుట గార్హస్థ్యమంటారు. తృతీయాశ్రమ ధర్మమే వానప్రస్థం. గృహస్థుడు పుత్రపౌత్రాది సంతానాన్ని చూచి సర్వసుఖములనుభవించి వారిని

త్యజించి వనము ప్రవేశించి అక్కడ ఆయా ధర్మాలను ఆచరించుట వానప్రస్థమనబడుతున్నది. తురీయాశ్రమమే సన్యాసాశ్రమం. ఇందులో సుఖదుఃఖాలు లేక అద్వైత భావంతో సమదృష్టి వహించి భిక్షాచరణతో కాలం గడుపుతూ పరమాత్మ సంయోగం కొరకు ఎదురుచూసే విధానం వర్ణింపబడినది.

**ఉత్కృష్టత**

పై తెల్పిన నాల్గు ఆశ్రమ ధర్మాలలో వానప్రస్థాశ్రమధర్మం వైఖానసకల్పసూత్రంలో సర్వ సమ్మతంగా వర్ణింపబడింది. ఎట్లంటే పత్నితో కూడి వానప్రస్థాశ్రమం స్వీకరించ వచ్చని ఆనుషంగికముగా చెప్పబడింది. వనంలో భార్యలేక దర్భశయ్యపై శయనించి జితేంద్రుడై ఉండాలని నిర్దేశింపబడింది. (ఇద్దరూ బ్రహ్మచర్య ధర్మాలు మాత్రమే అవలంబించాలి). "శ్రావణక" అనే అగ్నికుండం నిర్మించి దానిని ఔపాసన విధానంతో హోమం చేయాలని, స్వయంగా ఆయా కాలాలందు, పక్వములైన ఫలాలను గానీ ఆకులను గానీ భుజించి ఉత్తరోత్తరముగా తపస్సంయోగాన్ని అధికంచేసి విశిష్టమైన ఫలం కొరకు పరితపించాలని, ప్రధానంగా ఈ వానప్రస్థాశ్రమ ధర్మంలో నిర్ణయింపబడింది. ఈ కల్పసూత్రం మాత్రమే ఈ ఆశ్రమ ధర్మాన్ని గూర్చి విపులముగా వివరించడం వల్ల ఆశ్రమం వైఖానసమని ప్రసిద్ధిపొందింది.

ఈ విధంగా వర్ణింపబడటంచే తృతీయాశ్రమంలో ప్రవేశించదలచిన సర్వులూ ఈ కల్పోక్త ఆశ్రమధర్మాలే అవలంబించాలని మనువు తన స్మృతి గ్రంథంలో ప్రకటించాడు. బోధాయనుడు తన ధర్మసూత్రంలో కూడా వానప్రస్థ ధర్మాలను వివరిస్తూ పై విషయాన్నే నిర్ధారించాడు. ఇంతేకాక గౌతమ ధర్మ సూత్రాలందు వానప్రస్థధర్మ విభాగంలో "శ్రామణకేనాగ్ని మాధాయ'' (1-3-26) అంటూ వానప్రస్థుడనగా వైఖానసుడే అని గౌతముడు తన అభిప్రాయాన్ని ఘంటా పథంగా తెలిపాడు.

ఈ విధంగా సర్వ మహర్షిప్రోక్త ధర్మాలందు కూడా ఇందులోని తృతీయాశ్రమ విధానం ప్రస్తుతింపబడి తన ఉత్కృష్టతను నిరూపించు కొన్నది. దీనికి మూలం ఏమనగా వానప్రస్థాశ్రమ ధర్మవిషయాన్ని సర్వులెవ్వరూ గుర్తింపక పోవటమే. కావున తృతీయాశ్రమమైన వానప్రస్థాన్ని స్వీకరించు వారందరూ ఇందులోచెప్పబడిన ధర్మాలను ఆచరించి కల్పోక్తఫలాన్ని పొంది ఉత్కృష్టులగుదురుగాక!

**భృగ్వత్రి కాశ్యపమరీచి మహర్షి మధ్యే**
**స్థిత్వాసనే కుశమయే సముదీరయన్తమ్।**
**శ్రీశాస్త్రసార మఖిలం విఖనోమునీంద్రమ్**
**భూయో నమామి, భువనైక గురుం ప్రపన్నమ్॥**






శ్రీమతి వి. అరుణ, తెనాలి, 9985939550

అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుని శాస్త్రోక్తముగ అర్చించుట బ్రహ్మాదులకు కూడా సాధ్యముకాని పని. విషయాసక్త పరులు, అవ్యవస్థిత చేతనులు అయిన మానవులు జరిపే శాస్త్రోక్త విధానమైన భగవత్పూజావిధానం అజ్ఞాతదోషావహం, అతి దుస్సాధ్యం అనేది నిస్సంశయం. ఇందులో ద్రవ్య మంత్రతంత్రాది లోపాలు అనేకాలు. ఈ లోపాలచే విష్ణుసాయుజ్యప్రాప్తి అసాధ్యం. ఇందుకు

**అజ్ఞాతానాం చ దోషాణాం**
**అర్చనాదిషు కర్మసు ।**
**జ్ఞాత్వాచానాద్రుతానాం చ**
**మోహాల్లోభా త్ప్రమాదతః ॥**
**తద్దోష శాన్తయే కుర్యా**
**త్సామాన్యాదిహనిష్కృతిమ్ ॥**

అనే భృగు సంహితా వచనాన్ని బట్టి అర్చనాది కర్మలందు ఉన్న దోష శాన్తికి సామాన్య ప్రాయశ్చిత్తం అత్యావశ్యకం. నిత్యనైమిత్తిక రూపాలతో ఉన్న సంవత్సరార్చనలో జ్ఞానాజ్ఞానాలచే సంభవించిన దోషనివృత్తికి ప్రత్యేకంగా ఉత్సవరూపాలలో ఉండే ఒక ప్రాయశ్చిత్తము చెప్పబడిఉంది. దానినే పవిత్రారోపణము లేక పవిత్రోత్సవము అని అంటారు. ఈ పవిత్రోత్సవమును గూర్చి ఆగమ శాస్త్రము ఈ విధంగా తెలుపుతున్నది.

**నిత్యేనైమిత్తికే వాఽపి**
**తథా సంవత్సరార్చనే ।**
**జ్ఞాన తోఽజ్ఞాన తో వాఽపి**
**యే దోషా స్సంభవన్తి వై ॥**
**పవిత్రారోపణే నైవ**
**తే శ్యాన్తి న సంశయః**
**సర్వదోషోపశమనం**
**సర్వకామ సమృద్ధిదం**
**ఆయురారోగ్యదం సర్వా**
**ధ్వర ఫలావహమ్**
**పవిత్రారోపణం విష్ణోః**
**కారయే త్సర్వశాన్తయే ॥**

సంవత్సరార్చనలోని దోష నివృత్తి కొరకే కాక సర్వయజ్ఞ ఫలప్రదం, ఆయురారోగ్యప్రదం, సర్వదోషోపశమనం, సర్వకామ సమృద్ధి లోకశాన్తి మొదలైన శుభ ఫలితాలకు ఈ పవిత్రోత్సవము కలియుగ ప్రత్యక్ష దైవానికి ప్రతి సంవత్సరము చేయాల్సి ఉంది.

ఈ పవిత్రోత్సవం ఆషాఢ శ్రావణ భాద్రపద మాసాలలో వచ్చే శుక్ల ద్వాదశినాడు గానీ శ్రవణా నక్షత్రములో దక్షిణాయనంలో గానీ చేయాలని ఆగమశాస్త్రోక్తము.

**ఆగష్టు 24 నుండి 27 వరకు శ్రీవారిపవిత్రోత్సవం**



ఈ పవిత్రోత్సవంలో పూసలుగా అమర్చబడిన మాలలను ప్రతిష్ఠించి శ్రీస్వామివారికి ఆలయ పరివార దేవతలకు సమర్పించుట ప్రధాన ఘట్టం. దేవాలయానికి దక్షిణభాగంలో గానీ స్నపనాలయమునగాని పవిత్రమండపాన్ని నిర్మించి దానిని శాస్త్రీయంగా సంపూర్ణంగా అలంకరించి దానిలో త్రిహస్తములతో గానీ చతుర్హస్తములతోగానీ పీఠమును తయారుచేయాలి. పద్మక్షౌమ సువర్ణాలతో ఒకదానితో పవిత్రసూత్రాలను తయారు చేయించడం ఉత్తమం. రౌప్యం మధ్యమం. కార్పాసం అధమమైనా సర్వదోష వివర్జితం. పతివ్రతలచే గానీ కన్యకలచే గానీ పవిత్ర సూత్రాలను తయారుచేయించి వాటిని పవిత్రమండపములోగల పీఠమునఉంచి వానిని కుశాగ్రములతోకూడిన పంచగవ్యములచే ప్రోక్షణ చేసి ఆగమోక్త విధానంగ వాటిని ప్రతిష్ఠించి పౌండరీకాగ్ని కుండమున హోమం జరిపి, ఉత్సవమూర్తులకు అష్టకలశస్నపన జరిపి, ధ్వజఛత్రచామర ఫింఛ నృత్యగేయ సమాయుక్తంతో ఆచార్యుడు ఆలయ ప్రదక్షిణంచేసి, దేవ దేవుని విశేషముగా అర్చించి, అష్టోత్తరశత (108) పవిత్రసూత్రములను జానుపర్యంతం సమర్పిస్తే ఉత్తమం. చతుః పంచాశత్ (54) సూత్రాలను ఊరువుల వరకు సమర్పిస్తే మధ్యమం. సప్తవింశతి (27) సూత్రాలను నాభ్యన్తము సమర్పిస్తే అధమం అని ఆగమోక్తం. దీనిని యధాశక్తి సమర్పించాలి. పవిత్రాలను ఈ విధంగా దేవదేవునికి ఆరోపణ చేయడమే పవిత్రారోపణం. ఇదే విధంగ ఆలయ పరివార దేవతలకు కూడ ఒక్కొక్కటి సమర్పించాలి. ఈ పవిత్రారోపణం నవాహంగా గానీ సప్తాహంగా గానీ పంచాహంగా గానీ త్ర్యహంగాగానీ ఏకాహంగా గానీ చేయవచ్చును. ఆ దినాలకు పూర్వం అంకురార్పణ చేయాలి. ఈ పవిత్రారోపణం రాజాజ్ఞచే కూడా న్విర్వర్తించవచ్చు. తిరుమలలో వేంచేసియున్న అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడు ఆశ్రితజన వత్సలుడు అయిన శ్రీశ్రీమన్నారాయణునికి వైఖానసాగమోక్తముగా జరిగే ఈ దివ్య పవిత్రోత్సవాన్ని భక్తితో చేయించిన లేక కనులారా వీక్షించిన భక్తులు సర్వదానఫలము, సర్వపాప వినిర్ముక్తి, యశస్సు, సంపద, సంవత్సరార్చన ఫలం, విష్ణుసాయుజ్యం, అశ్వమేధ యాగఫలం సర్వోపద్రవనివారణ కలగడమే కాక, భృగు అధికారంలో చెప్పబడిన విధంగా సర్వాభీష్ట ఫలాలు పొంది నిర్భీతులై ధర్మతత్పర నిష్ఠాగరిష్ఠులై సుఖిస్తారు.





## తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామివారి పవిత్రోత్సవ క్రమము

| | | | |
|---|---|---|---|
| **24-8-2015** | సోమవారము | అంకురార్పణము | శ్రావణమాసమున జరుగును. |
| **25-8-2015** | మంగళవారము | పవిత్ర ప్రతిష్ఠ | |
| **26-8-2015** | బుధవారము | పవిత్ర సమర్పణ | |
| **27-8-2015** | గురువారము | పూర్ణాహుతి | |



# శ్రీ హయగ్రీవావతారం

జూలకంటి బాలసుబ్రహ్మణ్యం, తిరుపతి, 9985670152

**స్వతస్సిద్ధం శుద్ధస్ఫటికమణి భూభృత్ ప్రతిభటం**
**సుధా సధ్రీచిభిః ద్యుతిభి రవదాత త్రిభువనమ్।**
**అనంతై స్త్రయ్యంతై రనువిహిత హేషా "హల హలం"**
**హతా శేషా వద్యం హయవదన మీడీమహి మహః**

– *వేదాంతదేశికుల హయగ్రీవస్తోత్రం*

శ్రీమన్నారాయణుడు అత్యంత కృపతో జగత్కల్యాణం కోసం హయవదనంతో "హయగ్రీవ స్వామి" గా అవతరించాడు.

హయగ్రీవస్వామి నిర్మలంగా, స్వచ్ఛంగాను ఉన్నాడు. తెల్లగా ప్రకాశిస్తున్నాడు. ఏమాత్రం తరగని అనంతమైన అమృతం వంటి ఆ హయవదనుని తేజస్సులవల్ల లోకాలన్నీ వింత వింతలుగా వెలుగొందుతూ ఉన్నాయి. అద్భుతంగా విరాజిల్లుతున్న ఆ హయగ్రీవుడు పెద్దగా 'హల! హల!' అంటూ హేషారవాన్ని చేస్తున్నాడు. ఆ స్వామివారి ఆ హేషారవమే, ఆ సకిలింపే, వేదాలుగా ఆవిర్భవించి విశ్వమంతటా వ్యాపించి సంభ్రమాశ్చర్యాలను గొల్పుతున్నాయి. అట్టి పరంజ్యోతి స్వరూపమైన శ్రీహయగ్రీవస్వామికి భక్తి పూర్వక నమస్కారములు!!

బాగుంది. ఇంతకూ ఎవరీ హయగ్రీవస్వామి!

ఎప్పుడు అవతరించాడు. ఎందుకు అవతరించాడు.

ఒకానొక శ్రావణమాసంలో పున్నమినాడు, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు దుష్టశిక్షణ, శిష్టరక్షణాలక్ష్యంతో హయగ్రీవుడిగా అవతరించాడు.



**ఆగష్టు 29 హయగ్రీవ జయంతి**

హయవదనంతో శంఖచక్రాది పంచాయుధాలతో శ్రీమహావిష్ణువు ఆవిర్భవించడాన్ని అనేక పురాణాలు అనేకవిధాలుగా చెబుతున్నాయి.

పూర్వం మధుకైటభులు అనే ఇద్దరు రాక్షసులు చతుర్ముఖ బ్రహ్మదేవుడు చేస్తున్న వేదగానాన్ని విన్నారు. ఎంతో మధురంగా శ్రవణపేయంగా వీనులవిందుగా సాగుతున్న వేదమంత్రాలకు ముగ్ధులు అయ్యారు. ఇంకేముంది! వాటిని దొంగిలిస్తే పోలా? అని అనుకొన్నారు. అనుకున్నదే తడవుగా ఆ పనికి పూనుకొన్నారు ఆ రక్కసులు.

పాపం ఇవేవీ గమనించని బ్రహ్మ దేవుడు తన నాలుగుముఖాలతో తన చేతుల్లోని వేదసంపుటిని చూస్తూ తన్మయంతో స్వరయుక్తంగా పఠిస్తున్నాడు. ఆ బ్రహ్మదేవుడి వేదపారాయణకు తగినట్లుగా చదువులతల్లి సరస్వతీదేవి తన వీణ "కచ్ఛపి" పై స్వరాలు పలికిస్తూ అరమోడ్పుకన్నులతో మైమరపుతో ఉండింది. ఇదే మంచి అదను అనుకొన్న మధుకైటభులు ఏమరుపాటున వున్న చతుర్ముఖుడినుండి వేదాలను ఎత్తుకొని పాతాళలోకానికి వెళ్ళిపోయారు.

జరిగిన ఆగడానికి తేరుకొన్నాడు బ్రహ్మ. సృష్టి కార్యక్రమం ఆగిపోయింది. ఒక విధమైన తమోగుణం, అజ్ఞానం ఆవహించింది బ్రహ్మదేవుడికి. మందుడయ్యాడు. అనగా కర్తవ్యతామూఢుడయ్యాడు. అలాంటి సమయంలో శ్రీమహావిష్ణువు హయగ్రీవ వదనంతో, శంఖచక్రాది ఆయుధాలతో అవతరించి, పాతాళానికెళ్లి



మధుకైటభులను సంహరించాడు. ఆ రక్కసుల బారినుండి తెచ్చిన వేదసంపుటిని మళ్లీ బ్రహ్మకప్పగించాడు పరంధాముడు. అంతే బ్రహ్మదేవుడి బుద్ధి చైతన్యవంతమై వికసించింది. మళ్లీ సృష్టికార్యం యథావిధిగా ప్రారంభమైంది.

అందువల్లనే హయగ్రీవస్వామి వేదాలరక్షకుడుగా, జ్ఞానప్రదాతగా, సకలవిద్యలకు ఆధారమూర్తి ఐన జగద్గురువుగా భాసిస్తూ ఇలా స్తుతింపబడినాడు.

**జ్ఞానానందమయం దేవం నిర్మల స్ఫటికాకృతిమ్. ।**
**ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే ॥**

ఇది ఇలావుండగా,

శ్రీహయగ్రీవ అవతార ఆవిర్భావాన్ని గూర్చి దేవీభాగవత మహాపురాణం మరోవిధంగా ఆవిష్కరిస్తున్నది.

ఒకప్పుడు గుర్రం తలతో ఉన్న రాక్షసుడు ఉండేవాడు. రాక్షసుడన్న తర్వాత ఊరికే వుంటాడా! హయగ్రీవంతో వున్న ఆ రక్కసుడు దుర్మార్గుడై లోకాల్ని ముప్పుతిప్పలు పెట్టాడు. వాడి ఆగడాలకు అడ్డూ ఆపూ లేకుండా పోయింది. అయినా వాడు అంతటితో ఆగలేదు. అసలు చావే లేకుండాలని అనుకొన్నాడు. అనుకొన్నదే తడవుగా పరాత్పరి, పరమేశ్వరి అయిన జగన్మాతను గూర్చి ఘోరంగా సాధన చేశాడు. వాడి తపస్సుకు అమ్మలగన్న అమ్మ జగదీశ్వరి సంతృప్తి చెందింది. ప్రత్యక్షమై ఏం కావాలని అడిగింది.

హయగ్రీవుడు పెద్ద సకిలింపుతో అట్టహాసం చేస్తూ తల్లీ! జగజ్జననీ! నాకు ఎవరితోను చావు ఉండకూడదన్నాడు. అది అసాధ్యం. పుట్టినది చావాల్సిందే. తప్పదన్నది దేవి. అయితే తన లాగానే గుర్రంతల ఉన్నవాడి చేతిలోనే మరణం సంభవించేట్లు వరం అడిగాడు వాడు. తథాస్తన్నది జగన్మాత. తనలాగే గుర్రం ముఖంతో పుట్టడం అసంభవం. కనుక తనకు చావే లేదు. రాదనుకున్నాడు. తనకు ఎదురే లేదనుకొని ఇంకా ఇంకా విజృంభించాడు.

కాలచక్రం గిర్రున తిరిగింది. ఆ తర్వాత ఒకనాడు శ్రీ వైకుంఠంలో శేషపాన్పుపై పవళించిన శ్రీమహావిష్ణువునకు పాదసేవ చేస్తున్నది, శ్రీమహాలక్ష్మి! ఏదో ఆలోచనలో ఉన్న శ్రీహరి, లక్ష్మిని చూస్తూ ఎందుకో అదో రకంగా నవ్వాడు.

నవ్వుల్లో కూడా తేడాలుంటాయి. ఆ తేడాలవల్లే అపార్థాలు వస్తాయి.

ఇక్కడ వ్యంగ్యంగా నవ్విన పతిదేవుని నవ్వుకు లక్ష్మీదేవి అనుమానించింది. ఎందుకు నవ్వాడు? నేను అందంగా లేనా? నా కంటే అందగత్తె అయిన మోహనాంగిని ఎవర్నైనా తలచుకొని నన్ను హేళనగా నవ్వుతున్నాడా? అని ఇలా పరిపరివిధాల అనుకోవడమే కాదు. అక్కసుతో అడిగేసింది కూడ. లక్ష్మీదేవి అంతటితో ఆగిందా. ఆవేశంతో స్వామీ! నన్ను గేలి చేస్తూ నవ్విన నీ తల తెగిపడు గాక! అని శాపనార్థాలు పెట్టింది!

ఈ హఠాత్సంఘటనకు, శపించిన లక్ష్మీదేవి, శాపానికి గురి అయిన విష్ణువు ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. నిదానంగా ఆలోచించి ఈ సంఘటన నుంచి తేరుకున్నారు. ఇది యాదృచ్ఛికం మాత్రం కాదు. లోకకల్యాణం కోసమే! మంచికోసమే! అని మనస్సుల్ని కుదుటపరచుకొన్నారు. లక్ష్మీనారాయణులు తర్వాత ఈ సంగతే మర్చిపోయారు.





ఒకప్పుడు శ్రీహరి రాక్షసులపై యుద్ధానికి వెళ్లి జయించి వచ్చాడు. కాని బాగా అలసిపోయినట్లున్నాడు. అందువల్ల తన చేతిలోని ధనస్సును గడ్డం కింద ఆన్చి కాస్త విశ్రాంతిగా కూర్చొని కన్నులు మూసికొన్నాడు. ఇంతలో దేవతలు తాము ఏదో యాగం చేస్తూ ఆహ్వానించడానికి శ్రీహరి దగ్గరికి వచ్చారు. పురుషోత్తముణ్ణి ఆహ్వానించకపోతే ఏం బావుంటుంది. యజ్ఞం సఫలమవ్వాలంటే తప్పక పిలవాలి కదా! మరి ఆయన్ను లేపేదెట్లా! అని యోచించారు. వాళ్లకు ఒక ఆలోచన తట్టింది.

ఒక చెదపురుగును సృష్టించారు. దాని పేరు "వమ్రి". నీవు ఎలాగైనా విష్ణువును నిద్రనుండి లేపు అన్నారు. నా కేమిటి లాభం? అడిగింది ఆ పురుగు. వేం చేసే యజ్ఞంలో హోమగుండం వెలుపల పడిన హోమద్రవ్యాలన్నీ నీకే అన్నారు దేవతలు. సరేనంటూ ఆ 'వమ్రి' క్రిమి, శ్రీహరి గడ్డం కింద అదిమిపెట్టుకొన్న వింటి నారిని కొరికింది. ఇంకేముంది! ఆ నారి తెగడం, విష్ణువు తల తెగి ఎగిరిపోవడం రెండూ ఒకేసారి జరిగినై. ఆ తలకోసం అంతటా వెదికారు. ఎక్కడా కనపడలేదు.

భయభ్రాంతులైన దేవతలు అమ్మవారిని వేడుకొన్నారు. వాళ్లను ఓదారుస్తూ జగన్మాత ఇది దైవ సంఘటన. ఎక్కడైనా గుర్రం తలను తెచ్చి అతికించండి, అంటూ పలికింది. వాళ్లు అలాగే చేశారు. ఈ గుర్రం తలతో శ్రీహరి హయగ్రీవుడై వెలుగొందాడు.



ఆ వైకుంఠధాముడు హయగ్రీవుడై అవతరించినరోజే శ్రావణమాసం పున్నమిరోజు. హయగ్రీవస్వామి లోకకంటకుడైన హయగ్రీవ రక్కసుణ్ణి వాని కోరిక మేరకే సంహరించాడు.

దేవీభాగవతంలోని గాధ ఇలా వుండగా, బ్రహ్మాండ పురాణంలో శ్రీహయగ్రీవ స్వామికి సంబంధించిన లోకకల్యాణ కారకమైన మరొక అద్భుతమైన సన్నివేశం ఉంది.

ఒకప్పుడు అగస్త్యమహర్షి శ్రీలక్ష్మీహయగ్రీవస్వామిని ఉపాసించినాడు. ఆ స్వామి ప్రత్యక్షమై ఏం కావాలని అడిగాడు. జగజ్జనని శ్రీ లలితాపరమేశ్వరిని గూర్చి ఏమి ఉపదేశించినా సరే! అన్నాడు మహర్షి. హయగ్రీవస్వామి శ్రీ లలితాఅమ్మవారి మంత్రాన్ని అంగన్యాస కరన్యాస పూర్వకంగా ఉపదేశించడమే గాక, లలితాదేవి మహత్వాన్ని గూర్చి విపులంగా తెలియజెప్పాడు.

అగస్త్యమహర్షి కూడా సర్వవిద్యాపరిపూర్ణుడు. అందుకే "అందరూ ఒక ఎత్తు అగస్త్యుడొక ఎత్తు" అన్న నానుడి అన్నివిధాలుగా ఆ మహర్షి గొప్పదనాన్ని చాటుతున్నది. ఇలా అన్నీ ఉపదేశించిన హయగ్రీవుడితో, అగస్త్యుడిలా అన్నాడు.

'స్వామీ! హయవదనా! అమ్మలగన్న అమ్మను గూర్చి నాకు సర్వవిధాల ఉపదేశించారు. కాని ఇంకొక కొరత వున్నది. అదే లలితా పరాభట్టారికా సహస్రనామస్తోత్ర వైశిష్ట్యాన్ని మీరు చెప్పకపోవడం వెలితిగా వున్నది. మీరు మరిచిపోయారేమో! లేక మీకు తెలిసినా, దాన్ని పొందడానికి నాకు అర్హత లేదా! అని భక్తి ప్రపత్తులతో అడిగాడు అగస్త్య మునీంద్రుడు.

వెంటనే హయగ్రీవుడు అగస్త్యా! నిజం. నీవు అన్నది నిజం. ఆ సహస్రనామస్తోత్రం అందరికీ ఉపదేశించరానిది. అతి రహస్యమైనది. మహిమ గలది కూడా! కాని నీవు భక్తిగా అడిగావు కనుక లోకక్షేమం కోసం, ఆ పరమేశ్వరి సంకల్పంతో దాన్ని ఉపదేశిస్తాను.

**"శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ**
**చిదగ్నికుండ సంభూతా దేవకార్య సముద్యతా।**
**ఉద్యద్భాను సహస్రాభా చతుర్బాహు సమన్వితా**
**రాగస్వరూప పాశాఢ్యాక్రోధాకారాంకుశోజ్జ్వలా**
**..................................................**
**..................................................**
**శ్రీచక్రరాజనిలయా శ్రీమత్త్రిపుర సుందరీ**
**శ్రీశివా శివశక్త్యైక్య రూపిణీ లలితాంబికా**
**ఏవం శ్రీలలితా దేవ్యా నామ్నాం సాహస్రకం జగుః"**

  

**ఇతి శ్రీబ్రహ్మాండపురాణే ఉత్తరాఖండే శ్రీహయగ్రీవాగస్త్య సంవాదే శ్రీలలితా రహస్య సహస్రనామస్తోత్రకథనం సంపూర్ణమ్" –**

అంటూ జరిగిన శ్రీహయగ్రీవస్వామి, అగస్త్యమహర్షి వారల సంవాదం వల్ల అత్యంత రహస్యమైన మహిమగల ఈ సహస్రనామ మంత్రం లోకానికి అందింది. ఆనాటినుండి అన్ని దేవీ ఆలయాల్లో ఈ మంత్రం అనుష్ఠింపబడుతు ఉండడమేగాక, దేవీ ఉపాసకులకు ఈ లలితాసహస్రనామం దివ్యమంత్రంగా విరాజిల్లుతూవుంది.

ఆ తర్వాత ఒకానొకప్పుడు శ్రీ హయగ్రీవస్వామిని చూసిన లక్ష్మీదేవికూడా తానూ గుర్రమైతే బాగుంటుందని తలచి, ఆడగుర్రంగా మారింది. ఈ ఇద్దరికీ ఆ సమయంలో హైహయుడను పుత్రుడు కలిగాడు.

మార్గంలో సరిగ్గా ఈశాన్యమూలన "శ్రీలక్ష్మీ హయగ్రీవస్వామివారి ఆలయం వున్నది.

శ్రీ హయగ్రీవస్వామి అవతరించిన నాటినుండి ఎందరిచేతనో జగద్గురువుగా ఉపాసింపబడుతూనే వున్నాడు. త్రిమతాచార్యులైన శ్రీ ఆదిశంకరులవారు, శ్రీరామానుజులవారు, శ్రీమధ్వాచార్యులవారు శ్రీహయగ్రీవ స్వామివారిని ఉపాసించినవారు. అలాగే మధ్వమత ప్రవర్ధకులయిన శ్రీవాదిరాజతీర్థులవారు శ్రీహయగ్రీవోపాసకులుగా జగత్ప్రసిద్ధి.

ఇలాగ శ్రీ హయగ్రీవస్వామి అవతరించిననాటినుండి జగద్గురువుగా, జ్ఞానానందమూర్తిగా, ఆధ్యాత్మిక చైతన్యాన్ని కలిగిస్తూ,


**శ్రీ శంకరాచార్యులు**


**శ్రీ రామానుజాచార్యులు**


**శ్రీ మధ్వాచార్యులు**

వైఖానసం, పాంచరాత్రం వంటి ఆగమాల నియమాను సారం హయగ్రీవుడు ప్రధాన మూర్తిగాను, ఉపాంగదేవతగాను, సాలగ్రామ రూపంలోను అర్చింపబడటం ఆయాచోట్ల ఉంది. వైఖానసాగమం ప్రకారంగా పూజలు జరిగే తిరుమలక్షేత్రంలో తిరుమలేశుడు తానే హయగ్రీవుణ్ణి అంటూ ప్రతిరోజూ,

**ఓం హయగ్రీవాయ నమః**
**ఓం కైటభారయే నమః**
**ఓం గ్రాహఘ్నాయనమః**

వంటి నామాలతో అర్చింపబడటం విశేషం! అంతమాత్రమేగాక తిరుమల శ్రీవారి ఆలయ మహాప్రదక్షిణ

సర్వవిద్యలకు అధిదైవంగా భాసిస్తున్నాడు. ఆ స్వామి బోధించిన శ్రీలలితాసహస్రనామమంత్రం అనుసంధానం చేసికొంటూ, ప్రత్యేకంగా శ్రీహయగ్రీవుడు అవతరించిన ఈ శ్రావణ మాసంలో ఉపాసనా మార్గంలో పయనించడం మనందరికి సర్వశ్రేయో దాయకం! సర్వార్థ సిద్ధిప్రదం కూడా!!

**విశుద్ధ విజ్ఞాన ఘనస్వరూపం**
**విజ్ఞాన విశ్రాణన బద్ధదీక్షమ్**
**ధయానిధిం దేహభృతాం శరణ్యం**
**దేవం హయగ్రీవమహం ప్రపద్యే ॥**



# గజేంద్రమోక్షణం



కె.వి.ఆర్. తిరుమలాచార్యులు, విజయవాడ, 9441471867

శ్రీమంతుడైన భగవంతునికి సంబంధించినదే శ్రీమద్భాగవతం. అనంతాలైన ఆయననామాలు; దివ్యమంగళ రూపాలు; అద్భుతములైన లీలలు; అర్థంకాని మాయలు; మహా మాన్వితాలైన స్తోత్రాలు, ఉత్తమ జ్ఞానబోధకాలైన ఉపదేశాలు – భక్తితత్త్వాలు – అదే వ్యాసభగవానులు మనకందించిన శ్రీమద్భాగవతం.

గజేంద్రమోక్షణము శ్రీమద్భాగవతపురాణంలో అష్టమ స్కంధంలో వర్ణింపబడిన ఒక చిన్న వృత్తాంతం. అష్టమస్కంధం – రెండు – మూడు – నాలుగు అధ్యాయాలలో – మొత్తం 92 శ్లోకాలలో ఈ కథని చెప్పారు. రెండవఅధ్యాయంలో త్రికూటాచలాది వర్ణనం; గజేంద్రుని మకరి పట్టుకోవడం – ఆ పట్టుని విడిపించుకొనలేక గజేంద్రుడు భగవంతుని శరణు వేడ నిశ్చయించు కోవడం – అనే విషయాలున్నాయి. మూడవ అధ్యాయంలో – గజేంద్రుడు చేసిన భగవత్స్తుతి – హరిసాక్షాత్కారం – మకర సంహారం – గజేంద్రమోక్షణం వర్ణింపబడ్డాయి. ఇక నాల్గవ అధ్యాయంలో – మొసలి – ఏనుగుల పూర్వజన్మ వృత్తాంతము – గజేంద్రమోక్షణ కథామాహాత్మ్యము – చక్కగా వర్ణింపబడినవి.



వ్యాసభగవానుడు ఈ కథారంభంలో 'గజేంద్రమోక్షణం' జరిగిన భవ్యప్రదేశం – త్రికూటాచలాన్ని హృద్యంగా వర్ణించారు.

క్షీరసముద్రం మధ్యలో మిలమిల మెరుస్తూ వెలుగులు చిమ్మే శ్వేతద్వీపంలో త్రికూటమనే సుందరమైన పెద్ద పర్వతం ఉంది. ఆ పర్వతం ఎత్తు పదివేలయోజనాలు. వైశాల్యం పదివేలయోజనాలు. ఒకనాడు ఆ కొండపై అడవిలో ఉండే గజరాజు ఆడఏనుగులతో – కలసి విహరిస్తూ దప్పిక గొన్న ఏనుగుల మంద చుట్టుముట్టిరాగా దారిలోఉన్న ముళ్లు – వెదుళ్ళతో నిండిన పొదలను – పెద్ద – పెద్ద – చెట్లను ఛిన్నాభిన్నం చేస్తూ ఆ సరస్సు తీరానికి వచ్చాడు. అడవిలోని సింహాలు – పులులు మొదలైన క్రూరజంతువులకు అతడు అతి భయంకరుడు. కుందేళ్లు – లేళ్ళు వంటి అల్ప – సాధుజంతువులపట్ల దయ కల్గినవాడు. గజరాజు ఎండవేడికి తపించిపోతున్నాడు. దప్పికతోనున్న గుంపుతో సహా వేగంగా వచ్చి సరస్సులోదిగాడు. మునిగాడు. బంగారు తామరల పుప్పొడితో నిండి సువాసనలు వెదజల్లుతున్న నీటిని తన తుండముతో పీల్చి పైన జల్లుకుంటూ స్నానం చేశాడు. స్వచ్ఛమూ అమృతమయమూ అయిన ఆ నీటిని తృప్తిగా త్రాగాడు. అలసట తీరింది. కానీ విష్ణుమాయ వలన తనకు వాటిల్లబోతున్న ఆపదని గమనించలేకపోయాడు. ఆ సరస్సులోని బలిష్ఠమైన మొసలి ఒకటి దైవప్రేరితమై ఆ ఏనుగు కాలును పట్టుకుంది. విధివశాత్తు ఆపదలో చిక్కుకున్న గజేంద్రుడు





దానిని విడిపించుకొని బయటపడే ప్రయత్నం చేశాడు. మొసలి తన బలంతో ఏనుగుని సరస్సులోపలికి లాక్కుపోతూంటే దుఃఖిస్తూన్న గజేంద్రుని చూచి ఆడ ఏనుగులు దీనంగా ఏడ్చాయి. తోడుగా వచ్చిన ఏనుగులు అతనిని ఆ మొసలి బారినుండి రక్షించలేకపోయాయి. ఈ విధంగా ఏనుగు నీటినుండి బయటకు రావడానికి – మొసలి దానిని లోపలకు లాగటానికి – తీవ్రంగా ప్రయత్నిస్తుండగా ఆ రెండింటికీ వేయి సంవత్సరాలపాటు దేవతలకు కూడ ఆశ్చర్యం కలిగించేటట్లు భీకరమైన పోరాటం జరిగింది. సరస్సులో నిలిచి దీర్ఘకాలం పోరాడడం మూలంగా అలసిపోయిన గజరాజుకి – మానసిక ఉత్సాహం – దేహసామర్థ్యం – ఇంద్రియ బలం – అనే మూడు శక్తులూ క్రమంగా సన్నగిల్లిపోతున్నాయి. కానీ నీటిలో నుండి పోరాడుతున్న మొసలికి ఇవన్నీ క్రమంగా పెరుగుతున్నాయి.



ఈ విధంగా ప్రాణసంకటంలో పడి వివశుడై తనను తాను రక్షించుకోలేని వాడై చాలాసేపు ఆలోచించి – 'నన్ను నాతోటి ఏనుగులే రక్షించలేనపుడు –ఈ ఆడ ఏనుగులు ఎలా రక్షించగల్గుతాయి! ఏ దైవం వలన ఈ మొసలి బారిన పడ్డానో అతడే నన్ను రక్షిస్తాడు. కావున అతనినే శరణువేడాలని' – నిశ్చయించుకున్నాడు. తీవ్రమైన వేగంతో ముంచుకొచ్చే మృత్యువును గురించి భయపడే ప్రపన్నుని రక్షించేవాడు; ఎవడంటే మృత్యువు భయపడి పారిపోతుందో అటువంటి శరణాగత రక్షకుణ్ణి – ఆ పరమేశ్వరుని తాను శరణువేడాలని నిశ్చయించుకున్నాడు. మనస్సుని ఇతర విషయాల నుండి మరల్చి – పరమాత్మస్వరూపాన్ని హృదయంలో స్థిరంగా నిలిపి – పూర్వజన్మలో అభ్యసించిన స్తోత్రాన్ని జపించడం ప్రారంభించాడు. మొసలి పట్టునుండి విడిపించుకొని సరసునుండి బయట పడేందుకు గజేంద్రుడు విఫలయత్నం చేశాడు.

అతి బలవంతుడననే అహంకారంతో సుదీర్ఘకాలం పోరాటం చేశాడు. అహంకారం ఉన్నంతవరకూ జ్ఞానం కలుగదు. తనకున్న శక్తులన్నీ తగ్గిపోయాయి. తనవాళ్ళు తనను రక్షించలేరనీ – తనను తాను కూడ రక్షించుకొనలేడనే యధార్థస్థితి అప్పటికి తెలిసింది.

ఈ విధంగా శ్రీమన్నారాయణుడే శరణ్యుడని స్తుతించిన తరువాత గజేంద్రుడు భగవంతుని వివిధగుణాలను కీర్తించే నామాలతో స్తోత్రం చేశాడని వ్యాసభగవానుడు వర్ణించాడు.

ఈ విధంగా నామాలతో భగవంతుని స్తుతించిన తరువాత – "ధర్మాన్నో, అర్థాన్నో, కామాన్నో, మోక్షాన్నో కోరి తనను సేవించేవారికి దానిని ప్రసాదించడమే కాక, వారు కోరని దివ్యములైన దీవెనలను; ఇచ్చేంత అపారకరుణా సముద్రుడు ఆ భగవంతుడు'' తనకు మోక్షాన్ని ప్రసాదించాలని గజేంద్రుడు వేడు కున్నాడు. ఏకాంతులైన ప్రపన్నులు అత్యద్భుతమూ మంగళమయమూ అయిన ఆతని చరిత్రను గానం చేస్తూ ఆనందసాగరంలో మునిగి తేలుతూ, ఇతర కోరికలనూ – ముక్తినీ కూడ కోరకుండా ఏ పరమాత్మని కొలుస్తూ ఉంటారో, ఆ పరమాత్మని; భక్తితో తప్ప ఇతర ఉపాయాలతో కాని – ఇంద్రియాలతో కాని దర్శింపశక్యం కానంత దూరంలో ఉన్న సూక్ష్మరూపుడు – ఆనందస్వరూపుడు – ఆదిపురుషుడు – అంతటా నిండి ఉన్నవాడు – శాశ్వతుడు – పరబ్రహ్మ – బ్రహ్మాదులకు కూడ ఈశుడైన – ఆ పరమాత్మని; నేను స్తుతిస్తున్నాను అంటూ స్తోత్రం చేశాడు.

అహంకార మమకారాలతో నిండిన ఈ ఏనుగుజన్మ తనకు వద్దని, ఆత్మదర్శనానికి అవరోధమైన ఈ జన్మనుండి పునరావృత్తి రహితమైన మోక్షాన్నే తాను కోరుకుంటున్నానని తెలియజేస్తాడు.





'విశ్వస్రష్ట – విశ్వరూపుడు – విశ్వము కంటె విలక్షణమైన వాడు – విశ్వానికి సంపద అయినవాడు – విశ్వాంతరాత్మ – జన్మ రహితమైన పరబ్రహ్మము – పరముపద రూపుడైన పరమాత్మకు మోక్షాన్ని ప్రసాదించమని వేడుతూ ప్రణమిల్లడం తప్ప వేరేమి చేయగలనని ప్రార్థిస్తాడు. పరమాత్మ దర్శనానికి అవరోధాలైన పుణ్య – పాప కర్మలను యోగంద్వారా నాశనం చేసి, యోగంతో పరిశుద్ధమైన తమ అంతరంగాలలో యోగులు సాక్షాత్కరింప చేసుకొనే ఆ యోగేశ్వరునికి తాను ప్రణామాలను అర్పిస్తాడు. సహింప శక్యం కాని తీవ్రవేగం కల్గిన సృష్టి – స్థితి లయలనెడి త్రివిధశక్తులు కలిగినవాడా! సమస్త ధీగుణములకు మూల కారణమైన వాడా! ప్రపన్నుల రక్షించువాడా! అపారమైన సామర్థ్యం కలవాడా! ఇంద్రియ నిగ్రహం లేనివారికి చేరశక్యం గాని ఓ పరమాత్మా! నీకు నమస్సులు అని వేడుకుంటాడు. ఈ విధంగా ప్రణామాలు సమర్పించి గజేంద్రుడు స్తోత్రానికి చివరగా 'ఏ పరమాత్మ యొక్క మాయ వలన – అహంకారంతో హత ప్రాయుడై జీవుడు తనను తాను తెలుసుకోలేక పోతున్నాడో ఆ మహా మహిమాన్వితుడైన భగవంతుణ్ణి నేను శరణు వేడుతున్నానని' ప్రార్థించాడు. సకల జీవరాశులకు అభయం ఇచ్చి – వారిని రక్షించేది భగవంతుడు కదా! – అందుకే తన భక్తుడైన గజేంద్రుడు మొసలి బారిన పడి – దీనుడై ఆర్తితో తనను కాపాడమని మొర పెడుతూంటే రక్షించడానికి చక్రాయుధాన్ని ధరించాడు. అతివేగం గలిగిన తన వాహనమైన – గరుడుని అధిరోహించాడు – దేవతలందరూ చక్కగా స్తుతిస్తూండగా శీఘ్రంగా గజేంద్రుడున్న చోటుకి బయలుదేరాడు.



సరసులో నిలిచి మొసలిచే పీడింపబడుతూన్న గజేంద్రుడు అంతరిక్షంలో – గరుడునిపై కూర్చొని వస్తున్న శ్రీహరిని చూచాడు. తన తుండముతో పద్మాన్ని పట్టుకొని – తొండమెత్తి భక్తితో ఆ పద్మాన్ని స్వామికి సమర్పిస్తూ 'అఖిలగురుడా! భగవంతుడా! నారాయణా! నీకిదే నా నమస్కారం' అని దీనంగా ప్రణామాలను అర్పించాడు. **'పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, తదహం భక్త్యుపహృతం అశ్నామి'** అని కదా భగవంతుడు సెలవిచ్చాడు. కాబట్టి భక్తితో సమర్పిస్తే ఒక్క పూవైనా చాలు – భగవంతుడు దానిని స్వీకరిస్తాడు. గజేంద్రుని భక్తికి పరమాత్మ ప్రసన్నుడైనాడు.

గజేంద్రుని వద్దకు అతి త్వరగా చేరుకున్నాడు. మొసలితో సహా గజేంద్రుని సరసు వెలుపలికి లాగాడు. దేవతలందరూ ఆశ్చర్యంతో చూస్తూండగా చక్రంతో మొసలి కంఠాన్ని ఛేదించి – దాని పట్టునుండి గజేంద్రుని విడిపించాడు. శ్రీహరి చేసిన ఆ ఘనకార్యాన్ని ప్రశంసిస్తూ – బ్రహ్మ – రుద్రుడు – మొదలైన దేవతలు; ఋషులు, గంధర్వులు పూలవాన కురిపించారు. దుందుభులు మ్రోగాయి. గంధర్వులు పాడుతూ నృత్యం చేశారు. ఋషులు – సిద్ధులు పురుషోత్తముణ్ణి స్తుతించారు. ఆ క్షణంలోనే ఆ మొసలి వింతగొలిపే రూపాన్ని ధరించింది. దేవలుని శాపం నుండి విముక్తి పొంది 'హూహూ' అనే గంధర్వోత్తమునిగా మారిపోయింది. గంధర్వాధిపతీ – మహాగాయకుడూ అయిన 'హూహూ' – ఒకనాడు పరిహాసకేళిగా తపస్సంపన్నుడైన దేవలుని – సరస్సులోనికి లాగాడు. కోపించిన దేవలుడు ఆ గంధర్వుణ్ణి 'మొసలివై పొమ్మని' శపించాడు. పెద్దలతో పరిహాసం పెనుముప్పుకే కారణం కాగలదు! చాలాకాలం తరువాత

ఈనాటికి దైవవశాత్తు గజేంద్రుని పట్టుకొని – శ్రీహరి కరుణతో శాపాన్నుండి విముక్తుడైనాడు. అవ్యయుడు, అయిన శ్రీహరికి శిరసు వంచి నమస్కరించాడు. శ్లాఘింపదగిన అతని గుణాలను – ఘనచరిత్రను కీర్తిస్తూ పాడాడు. అతడు చేసిన గానస్తుతికి శ్రీహరి ప్రసన్నుడైనాడు. పరమాత్మ అనుమతి పొంది ఆయనకు ప్రదక్షిణ గావించి నమస్కరించి పాపాల నుండి విముక్తి పొందినవాడై లోకమంతా విస్తుపోతూ చూస్తూండగా 'హూహూ' తనలోకానికి వెళ్ళిపోయాడు.

ఈ గజేంద్రుడు పూర్వజన్మలో ద్రవిడ దేశాన్ని పాలించే పాండ్యరాజు. ఇంద్రుద్యుమ్నుడనే పేరుతో ప్రసిద్ధుడైన ఆ సాధుపుంగవుడు పరమభక్తాగ్రేసరుడు, విష్ణుసేవాపరాయణుడు. జటాధారియై తపవృత్తినాశ్రయించి ఒకనాడు అతడు – మలయపర్వతం పై కల ఆశ్రమంలో భగవదారాధనలో మనసు నిలిపి పరమేశ్వరుడగు శ్రీహరిని అర్చిస్తున్నాడు. ఆ సమయంలోనే, తలవని తలంపుగా అగస్త్య మహాముని శిష్యగణంతో కూడి అక్కడకు వచ్చాడు. మౌనియై – ఏకాంతంలో కూర్చుని ఉన్న ఇంద్రద్యుమ్నుని చూసి మాననీయుడైన తనను గౌరవించని కారణంగా అగస్త్యముని అతనిపై కోపించాడు. సజ్జనులకు ఉండదగిన లక్షణాలు లేని ఈ ఇంద్రద్యుమ్నుడు దురాత్ముడై మూఢుడై మమ్మల్ని అవమానించాడు కావున ఇపుడే అజ్ఞానంలో పడిపోవుగాక! ఏనుగువలె మందబుద్ధి అయిన వీడు 'ఏనుగు' అయిపోవుగాక!' అని శపించాడు. అనంతరం తన శిష్యులను వెంటబెట్టుకొని వెళ్ళిపోయాడు. పాపం! రాజర్షి అయిన ఇంద్రద్యుమ్నుడు ఆ ముని శాపం తన పూర్వజన్మ కృత పాప ఫలితమని భావించాడు. పూర్వజన్మ జ్ఞానాన్ని నశింపచేసే గజజాతిలో పుట్టాడు. కానీ చేసిన పుణ్యం వృథాకాదు కదా! ఏనుగుగా పుట్టినా పూర్వజన్మలో చేసిన భగవదర్చన మహిమవల్ల చివరికి పూర్వజన్మజ్ఞానాన్ని పొందగలిగాడు.

శ్రీమన్నారాయణుడావిధంగా గజేంద్రరక్షణం గావించాడు. దేవతలు – గంధర్వులు సిద్ధులు తాను చేసిన ఆ ఘనకార్యాన్ని స్తుతిస్తుండగా గరుడారూఢుడై శ్రీహరి గజేంద్రునితో సహా తన అనుచరులందరూ అనుసరించి రాగా వైకుంఠానికి బయలుదేరాడు. ఇదీ శ్రీహరి మాహాత్మ్యాన్ని వర్ణించే 'గజరాజమోక్షణమనే'' వృత్తాంతం. ఇది కలిపాపాలను పోగొడుతుంది. దుఃస్వప్నాలను నాశనం చేస్తుంది. కీర్తిని స్వర్గాన్ని ప్రసాదిస్తుంది. శుభాలనూ పొందగోరే భక్తజనులు ప్రాతఃకాలంలో నిద్రలేచి శుచులై దీనిని చదువుతుంటారు.



పరమాత్మ వైకుంఠాన్ని విడిచి కలియుగ వైకుంఠమైన తిరుమలకు వేంచేసి శ్రీనివాసుడైతే, ఆయన సేవలకోసం గజేంద్రుడు ఇక్కడకూ వచ్చాడు. నిత్యం జరిగే ఉత్సవాలలో 'అదుగో స్వామి వేంచేస్తూన్నాడు. తృప్తిగా దర్శించి తరించండి' అని భక్తులకు హెచ్చరికలు చేస్తూ ఉరేగింపుకి ముందు తాను నడుస్తూ కైంకర్యం చేస్తున్నాడు. బ్రహ్మోత్సవాలలో అయితే – మలయప్పను తనపై వేంచేపు చేసికొని అరమోడ్పు కన్నులతో నాలుగు తిరువీధులలో తిరుగాడే గజేంద్రుని భక్తి పారవశ్యం వర్ణనాతీతం! తన భక్తుడైన గజేంద్రునిపై ఠీవిగా వేంచేసి యున్నస్వామి 'భక్తులార! బాధలలో నున్నవారెవరైనా 'ఏడుకొండలవాడా! వెంకటరమణా! గోవిందా!' అని భక్తితో ఒక్కసారి పిలిస్తే చాలు – వారినందరినీ ఇదుగో ఈ గజేంద్రుణ్ణి రక్షించినట్లు గానే తప్పక రక్షిస్తాను" – అని భక్తులందరికీ తన కుడిచేతితో గజేంద్రుని చూపిస్తూ నాలుగుమాడ వీధుల్లో విహరించే కమనీయ దృశ్యం కన్నులపండుగే సుమా !!

  

భక్తియే భగవంతుణ్ణి ప్రసన్నుణ్ణి కావిస్తుంది. శుభప్రదాలైన శ్రీహరి అవతారాలను, వీరగాధలను, బాలలీలలను భాగవతం ద్వారా గాని–ఇతరగ్రంథాల ద్వారా గాని తెలిసికొని–నిత్యం జపిస్తే పరమహంస గతికి అవశ్యకమైన భక్తిని పొందవచ్చు. కాబట్టి నిశ్చలమైన భక్తితో–ప్రపన్నులమై త్రికరణశుద్ధిగా భగవంతుని సదా ఆరాధిస్తూ పరమాత్మని కోరుకోవలసినది ఒక్కటే. 'మేమెన్ని జన్మలెత్తినా ఎత్తవచ్చుగాక! నీవే మా నాధుడవు. కావున ఓ దేవదేవా! జన్మలన్నింటి లోనూ నీ పాదాలపై భక్తిని సడలనీయకయ్యా స్వామీ!" అని, భాగవతం మనకు ఉపదేశించే పరమార్థం ఇదే!!





ధారావాహిక 48

# మందార మకరందాలు



**నమ్మితి నా మనంబున సనాతనులైన యుమామహేశులన్**
**మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ మేటి పె**
**ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం బతి సేయు మమ్మ! నిన్**
**నమ్మినవారి కెన్నఁటికి నాశము లేదు గదమ్మ ! యీశ్వరీ!**

నిన్నటితరంవరకు తెలుగునాట కన్నెపిల్లలు భక్తి తాత్పర్యాలతో పాడుకున్న పద్యమిది. ఈ పద్యంలో ఉన్న జీవశక్తి ఆ భక్తి.

ఉమామహేశ్వరులు పురాణదంపతులు. అత్యంత సనాతనులు. మహేశ్వరుని అర్ధాంగి యైన మహేశ్వరి దయాజలధి. కల్యాణ సంసిద్ధికి శేవధి. రుక్మిణి ఈ పద్యంలో మొదట ఈ పురాణ దంపతులను కలిపి కైవారం చేసింది. పిదప ఆ చల్లని తల్లికి ప్రత్యేకంగా ప్రణమిల్లింది.

పారవశ్యానికి దారితీసిన భక్తిభావనం. దానిని అరటి పండొలచినట్లు ప్రకటించగలిగిన పదసంకలనం ఈ పద్యానికి నయనయుగళం.

ఆ యమ్మను 'అమ్మ' 'అమ్మ' అని ఐదుసార్లు సంబోధించడం ఈ పద్యం పొందిన ప్రాచుర్యానికి ప్రధాన కారణం.

**- జ్ఞానపీఠ అవార్డుగ్రహీత, పద్మభూషణ్ డా॥ సి.నారాయణరెడ్డి**



# గాయత్రీమంత్రోచ్చారణ మాహాత్మ్యము

శ్రీమతి మొలకా ఉత్తరఫల్గుణి, 8099681422.

**శ్లో॥ గీతా గంగాచ గాయత్రీ గోవిన్దేతి హృదిస్థితే।**
**చతుర్గకార సంయుక్తే పునర్జన్మ న విద్యతే ॥**

గీత – గంగ – గాయత్రి – గోవిందుడు – అను ఈ నాలుగు 'గ' కారయుక్త పదార్థములను ఎవరు హృదయమున ధరించునో అట్టివారికిక పునర్జన్మము లేదు. అనగా జననమరణ రూపమగు సంసారదుఃఖమునుండి వారు విముక్తి నొంది కైవల్యపదవి నధిష్ఠిస్తారని భావము. గీతాధ్యయనము, గంగాస్నానము, గాయత్రి మంత్రజపము, గోవిందునిధ్యానము అనే ఈ నాలుగూ ప్రతిఒక్కరి జీవితంలో ఆచరించదాన్ని ముఖ్యంగా తెలుసుకోవాల్సిన విషయంగా పరిగణించబడ్డది.

ఇందులో ప్రత్యేకించి గాయత్రిమంత్ర ఉచ్చారణమహిమ గురించి తెలుసుకుందాం.



ఆగష్టు 30 గాయత్రీజపం

**శ్లో॥ ఓం భూర్భువస్సువః తత్సవితుర్వరేణ్యం**
**భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ ॥**

పై తెల్పిన శ్లోకంనందు మహామహిమాన్వితమైన, సుశక్తిసంపన్నమైన బీజాక్షరాలున్నాయి. అవి శ్లోకాన్ని ఉచ్చరించేటప్పుడు ఒక్కొక్క బీజాక్షరం శరీరంలో నిబిడీకృతమైయున్న ఒక్కొక్క నాడీగ్రంథిని జాగృతం చేయటానికి సంసిద్ధమౌతుంది. అలా ఆ బీజాక్షరాలన్నీ నాడీగ్రంథుల్ని జాగృతం చేయటానికిగాను పూనుకోవడం జరుగుతుంది. గాయత్రిమంత్రశక్తి విశ్వవ్యాపకశక్తిగా అభివర్ణించడమైనది. ఆ శక్తితో సంబంధాన్ని అనుబంధించుకున్నట్లైతే సూక్ష్మప్రకృతి స్వాధీనమవుతుంది. దానివలన భౌతికము, మానసికము, ఆత్మకు సంబంధించిన క్షేత్రాల్లోని అన్ని సంపత్తులను పొందవీలవుతుంది. అలా శరీరమందున్న అన్ని అంగాలనుండి నాడులు శరీరమంతటా వ్యాపించియుంటాయి. అలాంటి ఆ నాడులన్నీ కలిసినట్లైతే గ్రంథియని పిలువబడుతుంది. అలా మానవ శరీరంనందు వివిధ గ్రంథులయందు వివిధశక్తులు నిబిడీకృతమై యుంటాయి. జపయోగంనందు నిష్ణులుగానున్నవారు ఆయామంత్రాలను ఉచ్చరించడంవలన ఆయా గ్రంథులయందు నిబిడీకృతమైయున్న శక్తులు వ్యక్తీకరించబడుతాయి.

### నాడీమండలంపై బీజాక్షరాల ఉచ్చారణ ప్రభావం :

**'ఓం'** – శిరస్సుపై ఆరుఅంగుళాల ప్రాంతంనందు శక్తి జాగృతమౌతుంది.

**'భూః'** – కుడికన్నుకుపైన నాలుగుఅంగుళాల ప్రాంతంనందు శక్తి జాగృతమౌతుంది.

**'భువ'** – త్రినేత్రముపైన అనగా ఫాలభాగమున మూడు అంగుళాల ప్రాంతంనందు శక్తి జాగృతమౌతుంది.





**'స్వః'** – ఎడమకన్నుకుపైన నాలుగుఅంగుళాల ప్రాంతంనందు శక్తి జాగృతమౌతుంది.

**'తత్'** – ఆజ్ఞాచక్రంనందున్న **'తాపిని'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'సాఫల్య'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'స'** – ఎడమకన్నుయందున్న **'సఫలత'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'పరాక్రమము'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'వి'** – కుడికన్నుయందున్న **'విశ్వ'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'పాలన'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'తుః'** – ఎడమచెవియందున్న **'తుష్టి'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'మంగళకరము'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'వ'** – కుడిచెవియందున్న **'వరద'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'యోగము'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'రే'** – నాసికామూలంనందున్న **'రేవతి'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'ప్రేమ'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'ణి'** – పైపెదవియందున్న **'సూక్ష్మ'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'ఘన'** అనే సంకేతం గల శక్తి జాగృతమౌతుంది.

**'యం'** – క్రిందిపెదవియందున్న **'జ్ఞాన'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'తేజము'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'భర్'** – కంఠంనందున్న **'భర్గ'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'రక్షణ'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'గో'** – కంఠకూపమునందున్న **'గోమతి'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'బుద్ధి'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'దే'** – ఎడమవైపు ఛాతీయొక్క అగ్రభాగంనందున్న **'దేవిక'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'దమనము'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'వ'** – కుడివైపు ఛాతీయొక్క అగ్రభాగంనందున్న **'వారాహి'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'నిష్ఠ'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'స్య'** – ఉదరానికి పైభాగాన చివరి ప్రక్కటెముకలు కలిసేస్థానంన **'సింహిని'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'ధారణా'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'ధీ'** – కాలేయంనందున్న **'ధ్యాన'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'ప్రాణ'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'మ'** – ప్లీహంనందున్న **'మర్యాద'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'సంయమ'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'హి'** – నాభియందున్న **'స్ఫుట'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'తపో'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'ధి'** – వెన్నెముక చివరిభాగంనందున్న **'మేధా'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'దూరదర్శితా'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'యో'** – ఎడమభుజంనందున్న **'యోగమాయా'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'అంతర్నిహితము'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'యో'** – కుడిభుజంనందున్న **'యోగిని'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'ఉత్పాదన'** అనే శక్తి జాగృతమౌతుంది.





**'నః'** – కుడిమోచేయియందున్న **'ధారిణి'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'సరసతా'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'ప్ర'** – ఎడమమోచేయియందున్న **'ప్రభవ'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'ఆదర్శ'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'చో'** – కుడిమణికట్టునందున్న **'ఊష్మా'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'సాహసము'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'ద'** – కుడి అరచేతియందున్న **'దృశ్య'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'వివేకము'** అనే శక్తి జాగృతమౌతుంది.

**'యాత్'**– ఎడమ అరచేతియందున్న **'నిరంజన'** అను గ్రంథియందు నిబిడీకృతమైయున్న **'సేవ'** అనే శక్తి జాగృతమౌతుంది.



పై విధంగా గాయత్రిమంత్రమునందున్న ప్రతీ బీజాక్షరమునకు మన శరీరమందున్న వివిధ ప్రాంతాలందు గల అన్ని గ్రంథులకునూ, ఆ గ్రంథులందు నిబిడీకృతమైయున్న అన్ని రకాల శక్తులకునూ సన్నిహిత సంబంధమున్నదని తెలుస్తోంది. కాబట్టి గాయత్రిమంత్రమును నిత్యమూ ధ్యానిస్తూన్నట్లైతే మన జీవనసాఫల్యతకు చక్కని మార్గదర్శకంగా ఉంటూ, దిశానిర్దేశమూ చేసే గాయత్రిమంత్రమహిమ ఎంతో గొప్పదిగా అభివర్ణించదమైనది.





**ఆగష్టు 13 శ్రీచక్రత్తాళ్వార్ జయంతి**

**సహస్రాదిత్య సంకాశం - సహస్రవదనం పరం**
**సహప్రదో స్సహస్రారం - ప్రపద్యేహం సుదర్శనం ॥**
**హసంతం హారకేయూర - మకుటాంగద భూషణైః**
**శోభనైర్భూషి తనుం - ప్రపద్యేహం సుదర్శనం ॥**
**ప్రాకారసహితం మంత్రం - పఠంతం శత్రు నిగ్రహం**
**సర్వదుష్టప్రశమనం - ప్రపద్యేహం సుదర్శనం ॥**
**రణత్కింకిణిజాలేన - రాక్షసఘ్నం హాద్భుతం**
**వ్యాప్తకేశం విరూపాక్షం - ప్రపద్యేహం సుదర్శనం ॥**
**హుంకార భైరవం భీమం - ప్రణతార్తిహరం ప్రభుం**
**శివం ప్రపన్న వదనం - ప్రపద్యేహం సుదర్శనం ॥**
**ఫట్కారాంత మనిర్దేశ్యం - మహామంత్రేణ సంయుతం**
**శుభం ప్రసన్నవదనం - ప్రపద్యేహం సుదర్శనం ॥**
**ఏతైష్షడ్భిస్తుతో దేవః - ప్రసన్నః శ్రీసుదర్శనః**
**రక్షాంకరోతు సర్వాత్మా - సర్వత్ర విజయీ భవేత్ ॥**



# గోదాదేవి

శ్రీ వేదార్థం మధుసూదన శర్మ, మహబూబ్‌నగర్, 9480065333

శ్రీమహావిష్ణుభక్తుడైన విష్ణుచిత్తుడి మనసు ఆనాడు విచారంతో నిండిపోయి ఉంది. తాను ప్రతినిత్యం యథా విధిగా చేసే మాలాకైంకర్యానికి ఈనాడు భంగం కలిగిందేమిటి? అనేది ఆయన విచారం. తనకు తులసీ వనంలో లభించిన శిశువును పెంచి, పెద్దచేసి విద్యాబుద్ధులు నేర్పించిన తన కుమార్తె గోదాదేవి వల్లనే ఈ అపచారం కలిగింది కదా! బాల్యచాపల్యంచేత తాను గ్రథించిన పుష్పమాలను గోదాదేవి ధరించింది. సరస్సు నీటిలో తన ప్రతిబింబం చూసుకొని మురిసిపోయింది ఆ మాలను తిరిగి సజ్జలో భద్రపరచింది. తాను చూసింది మేలైంది కాని లేకపోతే గోదాదేవి కొప్పులోని కేశాలచేత మలినమైన మాలను రోజు లాగ ఈ వేళ కూడ తాను స్వామికి సమర్పించేవాడే. జరిగిన అపరాధానికి చింతించాలా? లేక దోషం చేసినందుకు తన ముద్దులపట్టిని మందలించాలా? అనే ఆలోచనతోనే ఆ దినమంతా గడచిపోయింది. అతని మానసంలోని విచారం తొలగిపోలేదు.

సాయంకాలం స్నానాదికాలు ముగించుకొని విష్ణుచిత్తుడు వికలమైన మనస్సుతోనే ధ్యానమగ్నుడైనాడు. ఆ ధ్యానంలో స్వామి శ్రీరంగేశ్వరుడు తన ఎదుటకు వచ్చినట్టుగానే ఉన్నాడు. నీలమేఘంలాంటి శరీరం యొక్క తేజస్సుతో కౌస్తుభం, వనమాల ప్రకాశిస్తున్నాయి. తన ఎదుట నిలబడిన స్వామికి అంజలి ఘటించి స్వామీ! అపరాధం జరిగిపోయింది. ఈవేళ మీ కైంకర్యానికి మాలానమర్పణ చేయలేకపోయాను. మన్నించండి అని ప్రార్థించాడు. స్వామి ఇది విన్నాడో లేదో కాని ఆయన ముఖంలో తెల్లని వెన్నెలలాగా మందహాసం అలముకుంది. "విష్ణుచిత్తా! నీవేమి అపరాధం చేయలేదయ్యా! నీకుమార్తె గోదాదేవి ధరించిన మాలను ధరించడమే నా కిష్టం. ఆమె నాకుపరమభక్తురాలు. నాభక్తశిఖామణి ధరించిన మాలను తప్ప నేనేదీ ధరించను. రేపటినుంచి ఆ కన్యకామణి ధరించిన మాలతోనే నన్ను అలంకరించు. అదే నాకు ప్రీతిపాత్రం."

**ఆగష్టు 16**
**శ్రీఆండాళ్ జయంతి**



విష్ణుచిత్తుడు జాగ్రదావస్థలోకి వచ్చి, పరమాశ్చర్య భరితుడైనాడు. తన కుమార్తె అమాయక బాలిక గోదాదేవి ఇంతటి మహత్తును కలిగిందా! అనుకొని తన నిత్యవిధిని కొనసాగించాడు.

గోదాదేవి మహాభక్తురాలు. గొప్ప విదుషీమణి. శ్రీరంగేశ్వరుని తప్ప మరొకరిని పాణిగ్రహణం చేయనని పట్టుదల గలిగిన కన్యకామణి. తండ్రి భట్టనాథులకు ఈ విషయం తెలియవచ్చింది. త్రిలోకనాథుడైన శ్రీరంగేశుడెక్కడ? తన పేద ఇంటిలో పెరిగిన గోదాదేవి ఎక్కడ? అయినా దైవానుగ్రహం ఉంటే అసంభవమేమి?

  

అని భావించి ఒకనాడు కుమార్తెను దరికి చేర్చుకుని "అమ్మా! పూర్వ సంప్రదాయాన్ననుసరించి కన్యకను తాను కోరిన భర్త లభించవలెనంటే ఒక వ్రతముంది. ఆ వ్రతాన్ని నీవు ఆచరించు. శ్రీరంగడి అనుగ్రహం ఉంటే ఆయనే వచ్చి నిన్ను వరిస్తాడు" అని కాత్యాయనీవ్రతవిధానాన్ని సక్రమంగా తన కుమార్తెకు బోధించినాడు ఆ భక్తాగ్రేసరుడు.

విద్యాబుద్ధులు నేర్చిన గోదాదేవి శ్రీవిల్లిపుత్తూరులో కొందరు చెలికత్తెలను సమకూర్చుకున్నది. మార్గశీర్షమాసంలో ప్రాతః సమయాన చలిని కూడా లెక్క చేయక స్నానాదులు ముగించుకొని ఆలయంలో స్వామిని దర్శించి ఆయన సాన్నిధ్యంలో పాశురాలు నివేదించింది. తమిళంలో పాశురం అంటే పాట అని అర్థం. నిశ్శబ్ద ప్రాతఃసమయ వాతావరణంలో గోదాదేవి, ఆమెసఖులు శ్రావ్యంగా పాశురగానం చేస్తూ ఉంటే శ్రీవిల్లి పుత్తూరు వాసులంతా మేనులు పులకించగా మేల్కొనే వారట! భక్తి పారవశ్యంతో భగవంతుని అనుగ్రహంతో గోదాదేవి రోజుకొక పాశురం చొప్పున ముప్పది రోజులు 30 పాటలుస్వామికి నివేదించింది. వాటికే "తిరుప్పావై" అని పేరు. నాలాయిర దివ్యప్రబంధాల సారాంశం, వేదవేదాంగాల్లోని భావాలు తిరుప్పావై పాటల్లో నిక్షిప్తమై ఉన్నాయి. విశిష్టాద్వైత సంప్రదాయాను యాయులు మహాభక్తితో ధనుర్మాసంలో (మార్గశీర్షంలో) తిరుప్పావై పఠిస్తారు. సర్వలోకికిసౌఖ్యాలు, పారమార్థికవాంఛలు తిరుప్పావై పఠించడంచేత నెరవేరుతాయని భక్తుల విశ్వాసం. ఆ తిరుప్పావై పఠనమే మార్గళి. శ్రీ వైష్ణవులకు పరమ పవిత్ర పర్వసమయం.

తిరుప్పావై మహోత్సవం ఎటువంటిదో కాని శ్రీరంగేశ్వరుడు గోదాదేవికి ప్రత్యక్షమైనాడు. ప్రసన్నుడైనాడు. ఆమెను తన ప్రాణప్రదంగా భావించుకొని కల్యాణమహోత్సవంలో తనలో ఐక్యం చేసుకున్నాడు. శ్రీవైష్ణవులు గోదాదేవిని పన్నిద్దరాళ్వారులలో ఒకరిగా చేర్చుకుని నిత్యసమారాధన చేస్తారు. ఆమెవలెనే తాముకూడా పరమేశ్వరునిలో ఐక్యం కావాలని వాంఛిస్తారు.

# "ప్రతివాది భయంకర అణ్ణన్"

## (శ్రీ వేంకటేశ్వరస్వామివారి సుప్రభాతము రచయిత)



కౌసల్యాసుప్రజా! రామ! పూర్వాసంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవ మాహ్నికమ్ ॥
ఉత్తి ష్ఠోత్తిష్ఠ గోవింద! ఉత్తిష్ఠ గరుడధ్వజ!
ఉత్తిష్ఠ కమలాకాంత! త్రైలోక్యం మంగళం కురు॥...

శ్రీ వేంకటేశ్వరస్వామివారికి ప్రతినిత్యం గానంచేస్తున్న సుప్రభాతాన్ని రచించినవారు "హస్తిగిరినాథన్". వీరిని ముద్దుగా "అణ్ణన్" అని కూడా పిలుస్తారు. వీరు వేదాంతదేశికుల పుత్రుడైన వరదాచార్యుల (కుమారదేశికులు) వద్ద సంస్కృతవేదాంతాన్ని, శ్రీమణవాళ మహర్షివద్ద ద్రావిడవేదాంతాన్ని అభ్యసించారు. శ్రీ మణవాళమహర్షి అణ్ణన్‌కన్నా వయస్సులో ఎనిమిదిసంవత్సరాలు చిన్నవారు. వీరి నిర్యాణానంతరం అణ్ణన్ దాదాపు పదిసంవత్సరాలు జీవించారు.

వీరు 1361 ప్లవసంవత్సర ఆడిమాస పుష్యమీనక్షత్రంనాడు జన్మించారు. 1454 శ్రీముఖ సంవత్సర పంగునిమాస నవమీ పుష్యమీనక్షత్రంనాడు నిర్యాణం చెందారు.

ఒకనాడు వీరి గురువైన శ్రీమణవాళమహర్షితో కలిసి, శ్రీనివాసుని సేవించటానికై వీరు తిరుమలకు రావడం జరిగింది. ఆ ప్రభాతవేళ శిష్యునివైపుచూస్తూ స్వామిపై సుప్రభాతరచన చేయరాదా అని పలుకగా తక్షణమే వారి ఆదేశాలమేరకు శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం, స్తోత్రం, ప్రపత్తి, మంగళాశాసనం అనే నాల్గింటినీ ఆశువుగా పాడడం జరిగింది. ఈ సుప్రభాతానికి ముందు "తొండరడిప్పొడి ఆళ్వార్"(విప్రనారాయణ) రచించిన "ప్రాబోధికస్తుతి" ని సుప్రభాతంగా గానం చేసేవారు.

వీరి వేదాంతప్రకటన శక్తిని మెచ్చి, గురువు సంతోషించి, "ప్రతివాదిభయంకర" అనే బిరుదునిచ్చి సత్కరించడం జరిగింది. నేటికీ వీరి వంశం వారందరూ కూడా "ప్రతివాదిభయంకర" అనే ఇంటిపేరుతోనే పిలువబడుతున్నారు.



తిరుపతి శ్రీ గోవిందరాజస్వామివారి దక్షిణమాడవీథిలో ఉన్న శ్రీ లక్ష్మీనారాయణస్వామి వారి ఆలయంలో వీరి విగ్రహారాధన నేటికీ జరుగుతూంది.

"ప్రతివాది భయంకర అణ్ణన్"
జయంతి 13-08-2015
















గోదావరి పుష్కరాల సందర్భంగా తి.తి.దే. రాజమండ్రిలో
శ్రీ వేంకటేశ్వరస్వామివారి నమూనా ఆలయాన్ని ఏర్పాటు చేసి శ్రీవారికి
నిత్యసేవలు జరిపించారు. గోదావరి మాతకు హారతులు ఇచ్చారు.
ఈ కార్యక్రమంలో రాష్ట్రముఖ్యమంత్రి, తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారి,
సంయుక్త కార్యనిర్వహణాధికారి, వేదపండితులు,
ఉద్యోగులు, భక్తులు పాల్గొన్నారు.













భారత రాష్ట్రపతి గౌ॥ ప్రణబ్ ముఖర్జి గారు
1.7.2015 న శ్రీ వేంకటేశ్వరస్వామివారిని, పద్మావతి అమ్మవారిని
కపిలేశ్వర స్వామివారిని దర్శించుకున్నారు. అనంతరం
వేదపండితుల ఆశీర్వచనాలు, శ్రీవారి ప్రసాదాలు అందజేశారు.
ఈ కార్యక్రమంలో ఆంధ్రరాష్ట్రగవర్నరు, ముఖ్యమంత్రి,
తి.తి.దే. ధర్మకర్తలమండలి అధ్యక్షులు, సభ్యులు,
శ్రీకార్యనిర్వహణాధికారి,
సంయుక్త కార్యనిర్వహణాధికారులు పాల్గొన్నారు.





శ్రీ విఖనసాచార్యులు
శ్రీమన్నారాయణుని
మానసపుత్రులు.
వీరు వైఖానసాగమశాస్త్రకారకులు.
తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి
ఆలయంలో అర్చనాదికైంకర్యాలు
వైఖానసాగమానుసారమే
జరుపబడుతూన్నాయి.

**శ్రీ విఖనసాచార్యస్వామివారి జయంతి**
**29-08-2015**



# పరిశోధనా ప్రభాకరులు

డా॥ బి.రామాచార్యులు, తిరుపతి, 9618239912

ఆంధ్రవాఙ్మయానికి విశేష సేవచేసిన తొలితరం పరిశోధకులలో ప్రముఖులు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి. కవిగా, కథారచయితగా, అనువాదకులుగా, వ్యాసరచయితగా, ప్రాచీనగ్రంథ పరిష్కర్తగా, పీఠికా రచయితగా, శాసన పరిష్కర్తగా, జానపద వాఙ్మయోద్ధారకులుగా, సంకలన గ్రంథసంధాతలుగా, సాహిత్యపరిశోధకులుగా శాస్త్రిగారు భావితరాల పరిశోధకులకు మార్గదర్శకులయ్యారు. తాళ్లపాకకవుల రచనలను, అన్నమాచార్య సంకీర్తనలను వెలుగులోనికి తెచ్చినవారిలో శాస్త్రిగారు ప్రప్రథములు. శ్రీవేంకటేశ్వర వాఙ్మయోద్ధారకులుగా సుప్రసిద్ధులు.

శ్రీప్రభాకరశాస్త్రిగారు క్రీ.శ. 1888 సంవత్సరం, ఫిబ్రవరి 7వ తేదీన, కృష్ణాజిల్లాలో దివిసీమలోని పెదకళ్లేపల్లిలో జన్మించారు. తండ్రి సుందరశాస్త్రి. తల్లి శేషమ్మ. శాస్త్రిగారి ప్రాథమికవిద్య పెదకళ్లేపల్లిలోని వీథిబడిలో జరిగింది. కొట్టరువు సుందరరామయ్యపంతులుగారు వారికి ప్రాథమికవిద్యను బోధించారు. బాల్యంనుండి వారికి తెలుగుభాషపట్ల మక్కువ ఎక్కువ. సుందర శాస్త్రిగారింట్లో సంస్కృతాంధ్రనిఘంటువులు, ధర్మశాస్త్రాది గ్రంథాలు ఉండడం వల్ల వారిల్లు వచ్చిపోయే పండితులతో కళకళలాడుతూ ఉండేది. అందువల్ల ప్రభాకరశాస్త్రి బాల్యంలోనే తమ ఇంట్లోఉన్న గ్రంథాలను చదివేవారు. వారు పెద్దయ్యాక "తెలుగురచనలనగా చిన్ననాటినుండియు నాకు బులుపాటము. తెలుగు పద్యములు వినుటకై చెవికోసికొనువాడను. గుజ్జనగూళ్ళతోపాటు తెనుగురచనల తీయదనము కూడ మా నాయనగారు నన్నాస్వాదింపించినారు" అని వ్రాసుకొన్నారు. వీథిబడిచదువు పూర్తయిన తర్వాత ఆ గ్రామంలోని శ్రీమద్దూరి రామావధానులవద్ద సంస్కృతభాషను, కాళిదాసత్రయం పూర్తి చేశారు. పిమ్మట చల్లపల్లిలోని అద్దేపల్లి సోమనాథ శాస్త్రిగారి దగ్గర లఘుకౌముది, తర్కశాస్త్రంలో ఒకటి, రెండు ప్రకరణాలు, సభాష్యంగా పతంజలి యోగసూత్రాలను, కావ్యనాటకాలంకారాది సాహిత్య గ్రంథాలను అధ్యయనం చేశారు. పదహారుసంవత్సరాల వయసు వచ్చేవరకు ప్రభాకర శాస్త్రిగారు సోమనాథ శాస్త్రిగారి వద్దనే విద్యను చదువుకోవడం జరిగింది. ఆ సమయంలో వారు నేర్చుకొన్న పతంజలి రచించినటువంటి యోగ సూత్రాలు తరువాతి కాలంలో వారి దివ్య యోగానుష్ఠానానికి ఉపయోగపడిందని చెప్పవచ్చు.



**ఆగష్టు 29 శ్రీవేటూరిప్రభాకరశాస్త్రి 65వ వర్ధంతి**

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి వద్ద సాహిత్యవిద్యనభ్యసించే కాలంలోనే అష్టావధాన, శతావధానాలను అభ్యసించి అందు కొంతవరకు నిష్ణాతులయ్యారు. ''శతావధాని వేటూరి ప్రభాకరశాస్త్రి"అని సరస్వతిపత్రికలో వ్రాసుకున్నారు కూడ. కాని తరువాతికాలంలో వారిదృష్టి అవధానాలవైపుగాక పరిశోధన, పరిష్కరణల వైపు సాగింది.

ప్రభాకరశాస్త్రిగారు బందరునుండి తమనివాసాన్ని మదరాసు మార్చారు. అది వారిజీవితంలో ఒక ప్రధానమైన మలుపు. ఆనాడు మదరాసు గొప్ప సాహిత్యకేంద్రం. మహామహోపండితులకు నిలయం. కందుకూరి వీరేశలింగం పంతులు, వేదం వేంకటరాయశాస్త్రి, కొక్కొండం వేంకటరత్నంపంతులులాంటి పండితులతో వారికి పరిచయమేర్పడింది. మద్రాసుచేరేనాటికి వారి వయసు పద్దెనిమిదేళ్లు. మొదట వారు తిరువళిక్కేణిలోని 'వెస్లి' మిషన్ హైస్కూల్‌లో తెలుగుపండితునిగా చేరారు. తరువాత ఆ స్కూలు 'కెల్లెట్ హైస్కూలు'గా పిలువబడింది. కొంతకాలం తరువాత శాస్త్రిగారు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారంలో మొదట

  

కాపీయిస్టుగా చేరారు. అపుడే వారికి పిసిపాటి జగన్నాథంగారి పుత్రిక 'మహాలక్ష్మి'గారితో వివాహమైంది. ప్రభుత్వప్రాచ్య లిఖితపుస్తకశాలలో ఉన్నపుడే చరిత్ర, సాహిత్య గ్రంథాలనెన్నింటినో పఠించారు. దానివల్ల విశేషప్రజ్ఞను, ప్రతిభను సంపాదించారు. తాళపత్ర ప్రతులను కంటవత్తిడుకొని చదివి వాటి పూర్వాపర వివరాలతో గ్రంథవివరణికలు (Discriptive catalogues) తయారు చేశారు. భాషాచరిత్ర పరిశోధకులకు అవి ఆధారగ్రంథాలైనవి. సాహిత్యరసికులు శ్రీమాన్ పనప్పాకం అనంతాచార్యులుగారితో సాహిత్య, కవితా గోష్ఠులను నిర్వహిస్తూ, తాను రచించిన రచనలను వారికి వినిపించిన తర్వాత ప్రచురణ కొరకై పత్రికలకు పంపేవారు. ఈ క్రమంలోనే వారికి వేదం వేంకటరాయ శాస్త్రి, గురజాడ అప్పారావు, గిడుగు వేంకట రామమూర్తి మున్నగు పండితులతో పరిచయం ఏర్పడింది. శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారితో కలిసి ద్రవిడదేశ పర్యటనచేసి ప్రాచీన గ్రంథాలను సేకరించారు. భాస నాటకాలను సేకరించి ప్రతిమ, కర్ణభారం, మధ్యమ మరియు వ్యాయోగాలను తెలుగు లోనికి అనువదించారు. ముదుసళ్ళ నాలుకలపైనా, జీర్ణతాళ పత్రాలలోనూ మూగవోయి పడిఉన్న పద్యాలను సేకరించి, వర్గీకరించి "చాటుపద్యమణి మంజరి" మొదటి భాగాన్ని ముద్రించారు. ఈగ్రంథం శాస్త్రిగారికి విశేషప్రచారాన్ని సమకూర్చింది. అటుతర్వాత రెండవభాగం కూడా ప్రచురింప బడింది. ప్రబంధ రత్నావళి, బాలభాషలను ప్రచురించారు. తిరుమల రామచంద్రగారితో కలిసి తెలుగు శాసనసంకలనాన్ని సిద్ధంచేశారు.



శ్రీ ప్రభాకరశాస్త్రి 1910 నుండి 1939 చివరిదాకా మదరాసు ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారంలో పనిచేస్తూ సాహిత్య కార్యకలాపాలలో పాల్గొనేవారు. పిమ్మట 1939లో తిరుమల తిరుపతి దేవస్థానముల కోరిక మేరకు తిరుపతికివచ్చి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో ఆంధ్రశాఖను స్థాపించి, దానికి ప్రధానాచార్యులయ్యారు. 1945 నుండి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయంలో పరిశోధకపండితులుగా పనిచేశారు. శ్రీమాన్ తాళ్ళపాక అన్నమాచార్యుల వారి సంకీర్తనలను పరిశీలించి రెండు సంపుటాలను నిశితంగా సంస్కరించి ప్రచురించారు.

అన్నమాచార్య ఉత్సవాలను జరుపుటకై శాస్త్రిగారే సంకల్పం చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు తిరుపతిలో ఒక మ్యూజియంను ఏర్పాటు చేసే బాధ్యతను శాస్త్రి గారికి అప్పగించగా మ్యూజియం స్థాపనకై నిర్విరామకృషి చేశారు. మ్యూజియంకై శిల్పాలను సేకరించే సమయంలో వారుపడ్డ శ్రమ కారణంగా శాస్త్రిగారు అనారోగ్యానికి గురి అయ్యారు. అంతకు ముందే శాస్త్రిగారు మాస్టరు సి.వి.వి.గారి శిష్యరికంలో యోగ విద్యను నేర్చుకొని ఎందరో రోగగ్రస్తులను వ్యాధులబారి నుండి రక్షించారు. శాస్త్రిగారు 1950 ఆగష్టు 29వ తేదీన తుదిశ్వాసను విడిచి బ్రహ్మైక్యం చెందారు.

వీరు కామధేనువు కథ, కలికిచిలుక, కరుణకము, మేనత్త, కాకిపగ లాంటి కథలను, ప్రజ్ఞాప్రభాకరం పేరుతో స్వీయచరిత్రను రచించారు. "The Economy of Human life" అనే ఆంగ్లగ్రంథాన్ని 'నీతినిధి' పేరుతో తెలుగులోకి అనువదించారు. తెలుగు మెఱుగులు, మీగడ తఱకలు, సింహావలోకనం, వ్యాసమంజరి, వ్యాసప్రభాకరం వీరి వ్యాససంకలనాలు.

ఉద్భటారాధ్యచరిత్ర, మనుచరిత్ర, బసవపురాణం, క్రీడాభిరామం, సుగ్రీవవిజయం, సుభద్రాకల్యాణము, రంగనాథరామాయణము ఇలా ఎన్నో ప్రాచీనగ్రంథాలను పరిష్కరించి చక్కని పీఠికలతో ప్రచురించారు. వీరి పీఠికలు విషయబాహుళ్యానికి, విస్తృతికే కాక ప్రామాణికతకు నిదర్శనాలు.

**శ్రీ శాస్త్రిగారు తి.తి.దే. ప్రాచ్యకళాశాలలో ప్రధాన ఆచార్యులుగా పనిచేశారు.**





దక్షిణాది భాషల్లో విస్తృతమైన, ప్రామాణికమైన, విషయ సంభృతమైన పీఠికలకు ప్రభాకరశాస్త్రిగారే ఒజ్జబంతి. అందుకే విశ్వనాథ సత్యనారాయణ శాస్త్రిగారు వీరి పీఠికలను గూర్చిచెబుతూ.

**"వేటురివారి వ్యాఖ్యలును పీఠికలున్ తెలుగుంబొలంతికిన్**
**పేటులురేగు గంధవొడిపెట్టిన పూతలు...................."**

– అని ప్రశంసించారు.

ప్రభాకరశాస్త్రిగారు కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, భారతి, త్రిలింగ, సరస్వతి, రెడ్డిరాణి, ఆనందవాహిని, ఆంధ్రవారపత్రిక మొదలగు పత్రికల్లో సాహిత్యం, శాసన, చారిత్రక, భాష విషయాలకు సంబంధించిన వ్యాసాలను రచించారు. వారి వ్యాసాలను గూర్చి ఆచార్య నాయని కృష్ణకుమారిగారు "ఈ వ్యాసాలు చిన్నవే. ఒక్కొక్కచోట కేవలం రేడియో శ్రోతలనుద్దేశించినవే. కాని ఈ వ్యాసాలలో కొన్ని కొన్ని ఆలోచనలు చాలా మౌలికమైనవి. అవి ఎంతమౌలికాలంటే విషయపరంగా ప్రభాకరులు యత్కించిత్ సందేహాన్ని ప్రకటిస్తే ఆ సందేహాన్ని ఇన్నియేండ్ల తరువాత కూడా మనమెవ్వరము రహితం చేయలేనంత మౌలికమైనవి" అని కొనియాడారు.

శ్రీవేంకటేశ్వరవాఙ్మయ సంశోధనకై శాస్త్రిగారు ప్రత్యేక కృషి చేశారు. వేంకటేశ్వరస్తుతి ప్రధానకములైన రచనలుచేసిన తాళ్లపాకకవులను తొలిసారిగా పరిచయం చేశారు. వేంకటేశ్వరవచనములు, శ్రీవేంకటేశ్వర లఘుకృతులు, వేంకటేశ్వర స్తుతిరత్నమాల మొదలైన వాటిని శాస్త్రిగారు సంకలనం చేశారు. తాళ్లపాక అన్నమయ్య వర్ధంతి ఉత్సవాలకు రూపకల్పనచేసి సంకీర్తనా ప్రచారానికి చేసిన కృషి తరువాత వచ్చిన పరిశోధకులకు ఎంతగానో దోహద పడింది.

శాస్త్రిగారు శిష్యవత్సలుడు. ఎందరో ఉత్తమోత్తమ శిష్యులను తయారు చేశారు. వ్యాధులబాధలను తొలగించారు. ఆర్తులను ఆదరించారు. అలాంటి గురూత్తముడు పరమపదించినపుడు మిత్రులు, పండితులు, కవులు ఎందరో అశ్రునివాళిని అర్పించారు. వారి మరణం తెలుగుజాతికి తీరని లోటంటూ;


తిరుమల శ్రీవారి ఆలయంలోని తాళ్లపాక అర

**"సరసుడు, పండితుం, డఖిలశాస్త్రవిశారదు, డాంధ్రవాఙ్మయాం**
**తరపరిశోధనోత్సుకు, డుదాత్త విమర్శక చక్రవర్తి, యా**
**పరమ పవిత్ర జీవుడు ప్రభాకర భాస్కరు డస్తమింప, దు**
**ర్ధరమగు నార్తితో దిమిరబంధుర మయ్యెను తెల్గుగుండియల్"**

అన్న శ్రీ పి.వి. రాజమన్నార్ మాటలు నిత్యసత్యాలు.






**కథం చ నామ తే రాజన్**
**లోకా నాక్రమ్య తేజసా ।**
**నారీ చౌర్య మిదం క్షుద్రం**
**కృతం శౌండీర్యమానినా ॥**

డా॥ అప్పజోడు వేంకటసుబ్బయ్య,
పూర్వకార్యదర్శి, హిందూధర్మప్రచార పరిషత్తు,
తి.తి.దే., 9014878108

ఇది ఒక మహా పతివ్రత – మరణించిన తన భర్త శిరస్సును తన తొడమీద ఉంచుకొని దుఃఖిస్తూ, పరాక్రమంతో ముల్లోకాలను జయించిన మహావీరుడివే, స్త్రీని దొంగలించే నీచాతి నీచమైన పనికి ఎందుకు పాల్పడ్డావని ఎత్తిపొడుస్తూ అన్నమాట.

ఆ భర్త ఎవరో కాదు – లంకాధిపతి రావణుడు.

ఆ భార్య ఎవరో కాదు – మహారాణి మండోదరీ దేవి.

అంత దుఃఖ సమయంలో కూడా, ఆమె తన భర్త తప్పును ఎత్తిచూపిందేగాని, ఆ తప్పుకు శిక్షగా తన భర్తను వధించిన శ్రీరామచంద్రుణ్ణి గాని, ఆయనతో చేయి కలిపిన తన మరది విభీషణుణ్ణి గాని ఒక్కమాట అనలేదు. భర్త బ్రతికి ఉన్నప్పుడు కూడా ఆమె అనేక పర్యాయాలు అతడు చేసిన తప్పును అతనికి తెలియజెప్పింది. సగౌరవంగా సీతాదేవిని శ్రీరామచంద్రునికి అప్పగించి శరణు వేడుమని ఒత్తిడి చేసింది.

ఇది త్రేతాయుగంలో సాటి స్త్రీకి జరిగిన అవమానానికి ఒక మహారాణి స్పందించిన తీరు.

**"ఎవ్వరి యాండ్రురింక పరిభవంబును బొందక బ్రదుకువారు".**

**"ఎయ్యదియేని నధర్మ మెవ్వరెం । దైన నొనర్చినం బ్రభువు లారసి దండన మాచరింతు రి । చ్చో ననుదన్న కీచకునిఁ జూచియు నూరకయున్కి పాడియే".**

ఇవి, ద్వాపర యుగంలో ఒక పరిచారిక రాజసభలో మాట్లాడిన మాటలు. ఆ రాజు తలదించుకొనేటట్లు మాట్లాడిన మాటలు.

ఆ పరిచారిక ఎవరో కాదు – సైరంధ్రి వేషంలో ఉన్న ద్రౌపది. ఆ భర్తలు ఎవరో కాదు – మారువేషాల్లో ఉన్న మహావీరులు పాండవులు. ఆ మహారాజు ఎవరో కాదు – మత్స్య దేశాధీశ్వరుడు విరాటుడు. ఆ పరిచారికను అవమానించిన కాముకుడు ఎవరో కాదు – సింహబలుడు కీచకుడు.

ఆనాడు తనకు అంత అవమానం జరిగితే భర్తలు చూస్తూ ఊరుకున్నారని ద్రౌపది ఊరుకోలేదు. ప్రభువు ఊరుకున్నాడని ఆ పరిచారిక ఊరుకోలేదు. నిరాశ నిస్పృహలకు లోనై క్రుంగిపోలేదు. జరిగిన అవమానాన్ని దిగమ్రింగుకొని దేవుణ్ణి నిందిస్తూ కూర్చోలేదు. ఆత్మహత్యకు పూనుకోలేదు.

ఆమె పట్టుబట్టి ఎంతో నేర్పుగ మహాబలశాలి అయిన ఒక భర్తను రెచ్చగొట్టింది. తన్నవమానించిన ఆ కామాంధుణ్ణి కీచకుణ్ణి చంపించింది. వాడి శవాన్ని కన్నార చూచి, చిటికె వేసి, తల ఊచి, ముక్కుమీద వ్రేలేసుకొని, 'దీనికై ఇంత సేసితే' అని ఎగతాళి చేసింది. తన కసి తీర్చుకొంది. ఆడువారి పట్ల ఇలా బరితెగించి అవమానకరంగా ప్రవర్తిస్తే ఇలాగే అవుతుందని ఒక్క కీచకుణ్ణే కాదు – మొత్తం మగజాతినే ఆ ఉక్కుమహిళ హెచ్చరించింది.

స్త్రీ చైతన్యం వెల్లివిరియాలి. స్త్రీ శక్తి సంఘటితం కావాలి. సాటి స్త్రీలకు అవమానాలు జరుగుతుంటే – తలుపులు మూసుకోవడాలు, అమ్మలక్కలతో ఆ ముచ్చట్లు చెప్పుకొని కాలక్షేపాలు చేయటాలు, అవి తమకే

  

జరిగితే కడుపులో దాచుకొని కుమిలిపోవటాలు, ఆత్మహత్యలకు పూనుకోవటాలు పూర్తిగా పోవాలి. అభ్యుదయ మహిళలు, స్త్రీపురుషులు పరస్పర విరుద్ధ శక్తులు కాదన్న మౌలిక సత్యాన్ని మరచిపోకుండా, పురుష వ్యతిరేక నినాదాలు పొడిగించకుండ, పురుషశక్తిని చైతన్యవంతం చేసి కూడగట్టుకోవాలి.

పురుషజాతి కూడా స్త్రీలకు బాసటగా నిలవాలి. అలా నిలవటం పురుష సంస్కారమని, అది తమ సామాజిక బాధ్యత అని భావించాలి. కలకంఠి కంట కన్నీరొలికితే అది జాతికి, దేశానికి, అరిష్టం అని గ్రహించాలి. స్త్రీలను గౌరవించే దేశమే సుభిక్షంగా వుంటుంది.

అప్పుడుగాని ఈ అసమానత సమసిపోదు. అప్పుడుగాని పురుష జాతికి గౌరవం పెరగదు. అప్పుడుగాని సమాజంలో స్త్రీలకు పూర్తి భద్రత లభించదు.

స్త్రీజాతికి స్ఫూర్తినిచ్చే మండోదరీ, ద్రౌపదుల మాటలు ప్రతి మహిళ తెలుసుకోదగినవి. ప్రతి పురుషుడు ఆలోచించదగ్గవి.





తిరుమల తిరుపతి దేవస్థానములు

## హైందవేతరుల ఆలయప్రవేశం...

*(జి.ఓ.ఎం.ఎస్.నెం.311, రెవెన్యూ, ఎండోమెంట్స్-I విభాగం, తేది: 9-4-1990 ప్రకారం)*

**తిరుమల తిరుపతి దేవస్థానముల ఆలయాలు కేవలం హిందువులకు మాత్రమే సంబంధించినవి. అన్యమతస్థులు ఆలయప్రవేశం చేయాలను కుంటే వారు హైందవమతం మీద విశ్వాసం ఉన్నట్లు ఒక ధ్రువీకరణ పత్రాన్ని ఇవ్వవలసి ఉంటుంది.**

**ఈ ధ్రువీకరణ పత్రాన్ని వైకుంఠం క్యూ కాంప్లెక్స్‌లు / సంయుక్త కార్యనిర్వహణాధికారిగారి క్యాంప్ కార్యాలయం / రెసెప్షన్ ఆఫీసర్స్, తిరుమలవారికి అందజేయవలసి ఉంటుంది.**

పేష్కారు
*శ్రీవారిఆలయం, తిరుమల*

## తిరుపతి శ్రీ కోదండరామస్వామివారి పవిత్రోత్సవ క్రమము

| | | | |
|---|---|---|---|
| **09-8-2015** | ఆదివారము | అంకురార్పణ (రాత్రి) | ఆషాఢ మాసమున జరుగును. |
| **10-8-2015** | సోమవారము | పవిత్ర ప్రతిష్ఠ | |
| **11-8-2015** | మంగళవారము | పవిత్ర సమర్పణ | |
| **12-8-2015** | బుధవారము | పవిత్రోత్సవ సమాప్తిః | |

## వాయల్పాడు శ్రీ పట్టాభిరామస్వామివారి పట్టాభిషేక మహోత్సవము

| | | | |
|---|---|---|---|
| **19-8-2015** | బుధవారము | శ్రీ పట్టాభిరామస్వామివారికి | శ్రావణమాసంలో శుక్లపంచమి నుండి సప్తమి వరకు జరుగును. |
| **20-8-2015** | గురువారము | శ్రీ పట్టాభిరామస్వామివారికి | |
| **21-8-2015** | శుక్రవారము | శ్రీ పట్టాభిరామస్వామివారికి | |



# వరలక్ష్మీవ్రతం



## గృహలక్ష్మి

శ్రీమతి ఉడాలి శారద, హైదరాబాదు, 9490192708

ప్రతి సంవత్సరం శ్రావణ పున్నమికి ముందు వచ్చెడి శుక్రవారంనాడు జరిగే వరలక్ష్మీ వ్రతాన్ని గూర్చి పూర్వం సూతుడనే మహర్షి శౌనకాది మునులకు యోగులకు ఇలా తెలియజేశాడు. 'పరమేశ్వరుడు పార్వతీదేవికి తెల్పిన అత్యంత ఫలవంతమైన వాటిలో స్త్రీలకు సకల సౌభాగ్యాలు కలిగే ఒక వ్రతాన్ని గూర్చి మీకు తెలియచేస్తాను జాగ్రత్తగా వినండి'.

ఒకనాడు కైలాసంలో వజ్రవైఢూర్యాది మణిగణ ఖచితమైన సింహాసనమునందు పరమేశ్వరుడు కూర్చుని ఉండగా, పార్వతీదేవి పరమేశ్వరునకు నమస్కరించి దేవా లోకములో స్త్రీలు ఏ వ్రతం ఆచరిస్తే సర్వసౌభాగ్యాలు కలిగి పుత్ర పౌత్రాదులతో సుఖంగా ఉంటారో అలాంటి వ్రతాన్ని గూర్చి తెలియజెప్పండి అని కోరింది. అంత పరమశివుడు –

పార్వతీ! స్త్రీలకు సర్వసౌభాగ్యాలను ప్రసాదించే మహనీయమైన ఒక వ్రతం ఉంది. అదే వరలక్ష్మీ వ్రతం. ఈ వ్రతాన్ని శ్రావణ మాసంలో పున్నమకు ముందువచ్చే శుక్రవారం నాడు చెయ్యాలి అని అన్నాడు. పార్వతీదేవి శంకరునితో ఆ వ్రతాన్ని ఏ విధంగా చేయాలి, ఎప్పుడు చెయ్యాలి మొదలైన విషయాలను వివరంగా చెప్పవలసినదిగా పరమేశ్వరుణ్ణి ప్రార్థించింది. అంత పరమేశ్వరుడు ఈ విధంగా తెలిపెను. మగధ దేశంలో కుండినమనే ఒక పట్టణము ఉంది. ఆ పట్టణం సర్వసంపదలకు నిలయం, ఆ నగరములో చారుమతి అనే ఒకస్త్రీ ఉండేది. ఆమె మహాప్రతివ్రత. ఆమె భర్తను దేవునితో సమానంగా తలచి ప్రతిదినం ఉదయం లేచి స్నానం చేసి పూలతో భర్తను పూజ చేసి పిదప అత్తమామలకు అనేక విధాలైన ఉపచారాలను చేసి ఇంటి పనులను చేసుకొనుచుండేది.



ఆగష్టు 28 వరలక్ష్మీవ్రతము

ఆ మహాపతివ్రతకు ఒకనాడు కలలో శ్రీమహాలక్ష్మీదేవి కనబడింది. "ఓ చారుమతీ నేను వరలక్ష్మీ దేవిని, నీపై నాకు అనుగ్రహం గలిగి ప్రత్యక్షమయ్యాను. శ్రావణశుక్ల పూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారంనాడు నన్ను సేవిస్తే నీకు కోరిన వరాలను తీరుస్తానని" చెప్పింది. అంతలోనే చారుమతి మహాలక్ష్మికి ప్రదక్షిణ నమస్కారాలు చేసింది.

**నమస్తే సర్వలోకానాం**
**జనన్యై పుణ్యమూర్తయే ।**
**శరణ్యే త్రిజగద్వంద్యే**
**విష్ణు వక్షస్థలాలయే ॥**

అని అనేక విధాల స్తోత్రంచేసి, "ఓ జగజ్జననీ, నీ కటాక్షం కలిగినంతనే జనులు ధన్యులుగాను, విద్వాంసులుగాను, సకల సంపన్నులగాను అవుతారు. నేను నా జన్మాంతరంలో చేసిన పుణ్య విశేషంవల్ల మీపాద దర్శనం నాకు లభించిందని" నమస్కరించెను.

అంత మహాలక్ష్మి సంతోషం చెంది చారుమతికి అనేక వరాలనిచ్చి అంతర్ధానము చెందెను. ఆ తర్వాత నిద్ర మేల్కొన్న చారుమతి లక్ష్మీదేవి కలలో ఆనతిచ్చిన విధాన్ని భర్తకు, అత్తమామలకు తెలిపింది. పున్నమకు ముందు వచ్చే శుక్రవారంనాడు తాను చేయదలచిన శ్రీ వరలక్ష్మీ వ్రతానికి గ్రామంలో ఉన్న అందరు, పుణ్య స్త్రీలను ఆహ్వానించింది చారుమతి.

గోమయంతో పూజా స్థలాన్ని అలికి ముగ్గులు తీర్చి దానిపై మంటపాన్ని కలశస్థాపన చేసింది. శ్రీలక్ష్మీ అమ్మవారిని ఆవాహనం చేసి శాస్త్రోక్తంగా పూజలు చేసి లక్ష్మీతోరమును కుడిచేతికి కట్టుకొని వచ్చిన స్త్రీలందరికి నోము దారములను చారుమతి ఇవ్వగా అందరూ ధరించారు.

**పద్మాసనే పద్మకరే**
**సర్వలోకైక పూజితే।**
**నారాయణ ప్రియే దేవి**
**సుప్రీతా భవ సర్వదా ॥**

ఆ తర్వాత నివేదనాదులు అర్పించింది. చివరగా ఆ స్త్రీలంతా భక్తితో ప్రదక్షిణం చేస్తూ వుండగా అందరికీ ఆ లక్ష్మీదేవి అనుగ్రహం వల్ల సర్వాభరణాలు కలిగాయి. అందరూ ఆశ్చర్యంతో అమ్మవారి అనుగ్రహంవల్ల కల్గిందని అనేక విధాల స్తుతించారు. అక్కడ చేరిన స్త్రీలందరి ఇళ్లలో కూడా సర్వసౌభాగ్యాలు కలిగాయి. అందరు ఆశ్చర్యపడి చారుమతిని పొగడుతూ అత్యంత భక్తి ప్రపత్తులతో శ్రీలక్ష్మీదేవి ప్రసాదాన్ని స్వీకరించి, స్త్రీలు తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. అప్పటినుంచి చారుమతితో బాటు అందరు స్త్రీలు వారి వారి ఇండ్లలో ఈ వరలక్ష్మీ వ్రతాన్ని ఆచరిస్తున్నారు. ఈ వ్రతాన్ని చేసిన వారికి, చూసిన వారికి, విన్న వారికి అన్ని కార్యాలు సిద్ధిస్తాయి. ఈ వ్రతాన్ని అందరూ చేయవచ్చును అని పార్వతీదేవికి పరమశివుడు తెలియచేసెను.

ఇది సూతుడు శౌనకాది మునులకు వినిపించిన పరమపవిత్రమైన వరలక్ష్మీవ్రతం. ఇది భవిష్యోత్తర పురాణంలోనిది. పరమ పవిత్రమైన శ్రావణశుక్రవారం వరలక్ష్మీ వ్రతాన్ని ఆచరించి ధన, ధాన్యాదులను సకల సౌభాగ్యాలను పొందండి. 

# 2015 సెప్టెంబరు నెల రాశిఫలాలు



## మేషరాశి

బుద్ధిచాంచల్యం, మాట, మనసు నిలకడ లేకపోవడం, అనవసర భయాందోళనలు. కుటుంబమున అంతర్గత సమస్యలు ఉంటాయి. మాసాంతంలో పుణ్యకార్యాచరణం, తీర్థయాత్రా సంకల్పాలు కలుగుతాయి.



## వృషభరాశి

అసౌఖ్య భోజనం, పనులలో బద్ధకం, వాయిదావేయడం వలన కష్టనష్టాలు. స్వజనులవల్ల విరోధాలు, మాటపట్టింపులు. మనసులో భయాందోళనలు, మాసాంతంలో కుటుంబ సభ్యులతో విందువినోదాలు, ఆహ్లాదకర కాలక్షేపాలు.



## మిథునరాశి

మాతృసమానులైన పెద్దవారి ఆశీర్వచనాలు అందుతాయి. వ్యాపారజనులకు అనుకూలమైన కాలం. ప్రభుత్వం నుండి ప్రోత్సాహకాలు ఆశించిన మేర కాకున్నా కొంతవరకూ పొందుతారు.



## కర్కాటకరాశి

మనోవ్యాకులం, అధిక ధనవ్యయం ఉంటాయి. ఆరోగ్యం కూడా అంతంత మాత్రంగా ఉంటూ సహనాన్ని పరీక్షిస్తుంది. మనసులో భయాందోళనలు ఉంటాయి. బంధువులు, మిత్రులు క్లిష్టసమయాల్లో వెన్నంటి ఉండి తమ సహాయ సహకారాలు అందజేస్తారు.



## సింహరాశి

వాహనాన్ని నడిపేటప్పుడు జాగ్రత్త అవసరము. అనవసర విషయాలలో ఆసక్తి కలిగి ఉంటారు. మనోచాంచల్యం కలిగి, నిలకడలేని నిర్ణయాలు తీసుకుంటారు. అజాగ్రత్త, పరధ్యానాలవల్ల నష్టసూచన.



## కన్యారాశి

మాసారంభంలో భూక్రయ విక్రయములందు లాభం, సంతోషం, పలు సందర్భములలో ధైర్యంగా ముందడుగు వేస్తారు. దైవభక్తి, ధర్మకార్యాలపట్ల ఆసక్తి. నూతన విషయాలను నేర్చుకొనవలనన్న తపన ఉంటాయి.



## తులారాశి

వృత్తివ్యాపారాదులు సక్రమంగా జరుగుతుంటాయి. అన్ని రంగాలలో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. ఉద్యోగులకు పై అధికారులతో సదవగాహనలు ఉంటాయి. ఇష్టపూర్వక బదిలీలకు యత్నించేవారు సఫలం అవుతారు.



## వృశ్చికరాశి

సంఘంలో కీర్తి ప్రతిష్ఠలు పెరుగుతాయి. తలచిన కార్యాలు శీఘ్రగతిన పురోగమిస్తాయి. ద్రవ్యలాభం కుటుంబ సభ్యులకు సలహా, సహాయాలు అందిస్తారు. ఆదరాభిమానాలతో ప్రవర్తిస్తారు. అన్యవిషయాలపట్ల ఆసక్తి.



## ధనూరాశి

బంధుమిత్రుల సహాయ సహకారాలతో కొన్ని ముఖ్య కార్యక్రమాలు విజయవంతంగా పూర్తి చేస్తారు. ధనలాభం. ప్రతి అంశంలో గతకాలం కంటే మేలు అనే భావన కలగటం ఉంటాయి. స్పెక్యులేషన్స్ మిశ్రమ ఫలితదాయకం.



## మకరరాశి

దూర ప్రయాణాలు నిరర్థకాలు అవుతాయి. ప్రతిపనిలో ఆటంకాలు చికాకును కలిగిస్తాయి. మనస్తాపం, అయినవారిచే మాటపడుట ఉంటాయి. ఉన్నతాధికారులకు స్థానచలన సూచనలు. మాసం చివరిలో గురుభక్తి, ఆరోగ్యం, నూతన వస్తు, వస్త్ర లాభములు.



## కుంభరాశి

ప్రభుత్వ సంబంధాలైన కోర్టు వ్యవహారాలలో ఆచితూచి వ్యవహరించాలి. మాటతొందర, కంగారు వలన చిక్కులు పడతారు. కష్టాలు తప్పవు.



## మీనరాశి

పలు సేవా కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంటారు. పుణ్యకార్యాలపట్ల, దేవతా దర్శనములందు ఆసక్తి కలిగి ఉంటారు. అంతటా వృద్ధి. శ్రమాధిక్యత ఉన్నా ఫలితం ఉంటుంది. పై అధికారుల ప్రశంసలు అందుకుంటారు.



# కుచేలుడు

బాలప్రబోధం

అవసరాల లక్ష్మీపతిరావు, విశాఖపట్నం, 0891-2783475

బలరాముడు, శ్రీకృష్ణుడు, సుదాముడు కాశీలో సాందీపనిమహర్షివద్ద విద్యనభ్యసించారు. విద్యాభ్యాసానంతరం ఎవరి గ్రామాలకు వారు చేరుకున్నారు.

కుచేలుణ్ణి భాగవతంలో సుదాముడని వ్యవహరిస్తారు. ఆతడిది 'మునిపల్లెగ్రామం'. 'వామాక్షి' ఆతని ధర్మపత్ని. బహుసంతానవంతుడైన ఆతడు దుర్భరదారిద్ర్యముతో బాధపడేవాడు. ఆతడు ధరించిన పంచ మాసికలువేసినదగుటచే 'కుచేలనామము' సార్థకమైంది. ఒకనాడు కుచేలుని భార్య భర్త చెంతచేరి కుటుంబ భారమధికమైంది. పిల్లలు తినడానికి తిండికూడా లేక అలమటిస్తున్నారు. వారిబాధ చూడలేకుండా ఉన్నాను. మీతో కూడా చదువుకున్న బాల్యసఖుడు గోపాలకృష్ణ ద్వారకలో ఉన్నట్లు మీరు చాలాసార్లు చెప్పారు. అతడాగర్భశ్రీమంతుడు, ఆశ్రితవత్సలుడు అని కూడా తెలిపారు. ఆతనిని ఆశ్రయించి మన దారిద్ర్యమును రూపుమాపుకుందాము.



వరదుడు సాధుభక్తజనవత్సలుడూ, ఆర్తశరణ్యుడూ, ఇందిరావరుడూ
దయాపయోనిధి, భగవంతుడు కృష్ణుడు ఆ కుశస్థలీపురమున
యాదవప్రకరములు భజియింపగనున్నవాడు.
నీవరిగిన నిన్నుజూచి విభుడప్పుడిచ్చు అనూహ్యసంపదల్.

అని కుచేలుని పలువిధాలుగా నచ్చచెప్పి, మిత్రదర్శనం, భగవత్సేవ, మనోవాంఛాఫలసిద్ధి ఏకకాలములో నెరవేరుతాయని ఆతనిని ద్వారక ప్రయాణానికి ఉత్సాహపరచింది.

ఎప్పుడో చిన్ననాటి స్నేహితుని దర్శనభాగ్యము లభిస్తుందని ఈ ప్రేరణ తన భాగ్యమునకేనని తలచి కుచేలుడు ప్రయాణానికి సిద్ధమయ్యాడు.

'వామాక్షీ! పెద్దలను, పిల్లలను, గర్భిణీలను, దేవుని దర్శించటానికి వెళ్లేటప్పుడు ఉట్టిచేత్తో వెళ్లరాదని శాస్త్రం చెపుతున్నది కదా! మన ఇంట్లో ఇవ్వడానికి ఏమైనా ఉందేమో చూడు' అన్నాడు. ముక్కిపోయిన అటుకులను డబ్బా అడుగునుంచి తీసి చిరిగిపోయిన ఆతని కండువాకు కట్టిపంపింది అతని భార్య.



కుచేలుడు ద్వారకకు బయలుదేరాడు. స్వర్ణమందిరాలు, దుర్గములు దాటి ద్వారకకు చేరుకున్నాడు. ద్వారకలో కాపలాభటులు అతన్ని కృష్ణుడి బాల్య స్నేహితుడని విశ్వసించలేకపోయారు. ఈ బడుగుబాపడెక్కడ? ఆ శ్రీకృష్ణుడెక్కడ? ఈతడు అబద్ధమాడుతున్నాడని సందేహించారు. కుచేలుని లోపలకు పంపకుండా గదమాయించారు.





కుచేలుని కంఠ స్వరము విన్న వెంటనే శ్రీకృష్ణుడు పరుగు పరుగున బయటకువచ్చి, ఆతనిని చిరునవ్వుతో కౌగలించుకొని స్వాగతం పలికాడు. ఆ దివ్యస్పర్శతో కుచేలుడు పులకితుడయ్యాడు. రుక్మిణీదేవి స్వర్ణకలశముతో పవిత్రోదకము తెచ్చిఇవ్వగా, ఆ జలముతో కుచేలుని పాదాలు కడిగి ఆ జలాన్ని పరమాత్మశిరమున చల్లుకున్నాడు. అందరూ కూడా అలాగే చేశారు.

కుచేలుని తన పర్యంకముపై కూర్చుండబెట్టుకుని పరిమళ గంధములను, లేపనములను స్వయముగా పూసి ఆతనిని చల్లబరిచి పూలతో పూజించాడు. మృష్టాన్నభోజనముతో సంతృప్తిపరిచాడు. రుక్మిణీదేవిచేత వింజామరలు వీయించాడు.



కృష్ణా! ముకుందా! నీవు వేదమయుడవు. సర్వజ్ఞుడవు. సకలవిద్యాస్వరూపుడవయిన నీవు గురుకులవాసము చేయుట, విద్యనభ్యసించుట గురువువద్దే నేర్చుకొనుట లోకమునకు చాటుట కొరకే కదాయని స్తుతించాడు. గురుకుల వాసమున జరిగిన సంగ తులను వారు మననము చేసుకున్నారు.

తాను తెచ్చిన అటుకులు పరమాత్మకు ఇచ్చేందుకు సిగ్గుపడ్డాడు. అది గ్రహించిన కృష్ణుడు తానే కుచేలుని అంగవస్త్రములో మూటకట్టుకున్న అటుకులు తీసుకొని ఆరగించాడు. మొదటి పిడికెడుతో భూలోక సంపదలు ప్రాప్తించగా, రెండవ పిడికెడుతో పాతాళలోకసంపదలు వశమయ్యాయి. మూడవ పిడికెడు తినే సమయంలో రుక్మిణి అడ్డుపడి తినకుండా ఆపింది. బాల్యవిశేషాలు మననం చేసుకొనుచు వారారాత్రి అంతా గడిపారు.

మరునాడు కుచేలుడు తన గృహానికి బయల్దేరాడు. పరమాత్మ అతనిని కౌగలించుకొని ఘనమైన వీడ్కోలిచ్చాడు.

పరమాత్మ ఎంతటి దయార్ద్రహృదయుడు. నన్నెంతగానో ఆదరించాడు. ఆ లక్ష్మీనాథుడు సంపదలు కల్గిన, నేను గర్విష్ఠినవుతానని మరియు ఆతనిని మరచి పోతానేమోనని తలచి సంపదలు నాకీయలేదు కాబోలు! ఆవిధంగా ఆలోచించుకుంటూ కుచేలుడు తన గ్రామము "మునిపల్లె"కు చేరుకున్నాడు. ఎంతటి విచిత్రమో! ఆ గ్రామములో ఒక్క పూరిగుడిసె కూడా కనిపించలేదు. అన్నీ భవనములే! అందరూ శ్రీమంతులే! కుచేలుడు తాను మరలా ద్వారక కరుదెంచితినా అని భ్రమపడ్డాడు.

అంతలో వామాక్షి సర్వాలంకార భూషితురాలై ఎదురేగి భర్తను భవనములోని అంతఃపురానికి తోడుకొని వెళ్ళింది. ఆ భవనములో సమస్త వస్తుసము దాయము సమృద్ధిగా ఉంది. అంతులేని భోగభాగ్యాలు, సిరిసంపదలు నాట్యం చేస్తున్నాయి.

అప్పుడు గ్రహించాడు కుచేలుడు. శ్రీకృష్ణుడు తనని అడుగకుండానే సమస్తసంపదలూ సమకూర్చాడని, తనకు వీడ్కోలు చెప్పేటప్పుడు కూడా మాటమాత్ర మైనా చెప్పలేదు. అటుకులు ప్రీతితో స్వీకరించి సమస్త ఐశ్వర్యములు ఇచ్చిన పరమాత్మునికి మనస్సులో కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. పరమాత్మ అండగానుండగా తనకేమి కొదువ. ఈ సంపదలు తనవి కావు. ఈ ఐశ్వర్యమును సద్వినియోగపరచాలని నిర్ణయించుకుని కుచేలుడు బీదసాదలకు భూరిదానములు ఇచ్చాడు. అన్నదానములు, భజనలు ఏర్పాటుచేసి జీవితాంతం పరమాత్మను సేవించుకుంటూ ఆ దంపతులు అంత్యకాలమున కైవల్యము పొందారు.

ఈ కథ చదివినవారికి, విన్నవారికి కూడా భక్తి చేకూరి సర్వకర్మబంధాలనుండి విముక్తి కలుగుతుంది.





# ప్రదక్షిణం... పరమార్థం!

ఎమ్. సూర్యప్రసాదరావు, ఖమ్మం, 9885156844

ఈ చరాచర జగత్తులో చైతన్యశక్తి సర్వం నిత్యం పరిభ్రమిస్తూనే ఉంటుంది. సూర్యునిచుట్టూ అనేక గ్రహాలు నిత్యం ప్రదక్షిణం చేస్తూ అనంత శక్తిని గ్రహిస్తున్నాయి. విశ్వాంతరాళంలో వివిధ నక్షత్ర మండలాలు నిత్యం ప్రకాశించేవి, పరిభ్రమణ శక్తి వల్లనే! గ్రహముల చేత గ్రహించబడిన శక్తితోనే గ్రహచర జీవులు చైతన్యవంతమవుతున్నాయి. సూర్యుని చుట్టూ చేసే ఒక ప్రదక్షిణ ఓ విధంగా శక్తిని పరిగ్రహించే 'ప్రదక్షిణ' అని చెప్పవచ్చు. విశ్వంలోని ప్రతీ అణువూ ప్రకృతి అనే పరమాత్మను కేంద్రీకరించుకొని – ఆయన ఇచ్చిన శక్తితోనే పరిభ్రమిస్తుంది. ప్రదక్షిణం వలన మాత్రమే గ్రహాలు సుస్థిరమైన స్థానం కల్పించుకోగలుగుతున్నాయని చెప్పవచ్చు.

ఈ విశ్వంలో జననం నుంచి మరణం వరకు ఒక ప్రదక్షిణ ఎన్నో ఆవృతాలతో జన్మలలో సంపాదించుకున్న కర్మల ఫలితాలను అనుభవించడమే. వాని దుష్ఫలితాలను తొలగించుకోవాలని తాపత్రయపడటమే, ప్రదక్షిణ పరమార్థం! ఆలయంలోని దైవశక్తి విశ్వశక్తి కేంద్రబిందువుకు ప్రతీక! ఆయన చుట్టూ ఉన్న ఆలయం విశ్వానికి సంకేతం! విశ్వంలో ప్రదక్షిణ చేయడం కుదరదు కనుక.. విశ్వేశ్వరుని చుట్టూ చేసే ప్రదక్షిణం విశ్వానికి చేసే ప్రదక్షిణంగా భావించవచ్చు.

**భూప్రదక్షిణ షట్కేన కాశీయాత్ర యుతే న చ।**
**సేతు స్నాన శతైర్యశ్చ తత్ఫలం మాతృ వందనం॥**

నవమాసాలు మోసి... రక్త మాంసాలు పంచిఇచ్చి.. ప్రాణాంతకమైన ప్రసవవేదనకు వెనుకాడకుండా.. జన్మనిచ్చి.. తనకంటే ఎంతో గొప్పవాడిగా తీర్చిదిద్దిన మాతృమూర్తి ఎలా ప్రప్రథమ దైవం అవుతుందో, ఏమి చేస్తే కృతజ్ఞత ప్రకటింపబడుతుందో తెలియపరచే వివరణ ఇది! భూ ప్రదక్షిణ ఆరుసార్లు చేసినా, పదివేలసార్లు కాశీయాత్ర చేసినా ఒక్కటే! అనేక వందలసార్లు కార్తిక స్నానం, మాఘస్నానాల వంటి ఎన్ని సముద్రస్నానాలు చేసినా ఒక్క మాతృమూర్తికి చేసే పాదాభివందనం కంటే తక్కువేనని శాస్త్రం చెబుతుంది. సత్కార్యాలుగా భావించే.. భూప్రదక్షిణం, కాశీయాత్రలకంటే ఆమెకు చేసే వందనమే అత్యుత్తమమని విజ్ఞులు వివరించారు.

భగవాన్ రమణమహర్షి 'ప్రదక్షిణ' అనే పదానికి అద్భుతమైన విశ్లేషణ చేశారు. 'ప్ర' అనే అక్షరం సమస్త పాపవినాశనకారి అనే అర్థానికి ప్రతీక! 'ద' అనే అక్షరం కోరికలన్ని తీరుతాయనే భావాన్నిస్తుంది. 'క్షి' అనే అక్షరం రాబోయే జన్మజన్మల రాహిత్యాన్ని, క్షయాన్ని సూచిస్తుంది. 'ణ' అంటే... అజ్ఞానం నుండి విముక్తి కలిగించి జ్ఞానం ప్రసాదించే ఆవృతం అని గ్రహించాలని వివరిస్తారు.

**ప్రచ్ఛినత్తి భయం సర్వం దకారో మోక్షసిద్ధిదః।**
**క్షికారాత్ క్షీయతే రోగః ణకారశ్రీ ప్రదాయకః॥**

'ప్ర' కారము భయమును పోగొడుతుంది. 'ద' కారము మోక్షాన్ని సిద్ధింపచేస్తుంది. 'క్షి' కారము రోగాలను క్షయకరణము చేస్తుంది. 'ణ' కారము సంపత్తు ప్రసాదంచే సంపత్ ప్రదాయకమని కపిలసంహిత వివరిస్తుంది.



**నవమాసయుతా నారీపూర్ణ కుంభం ధృతా సతీ**
**పదే పదం చ నిక్షిప్య యథా గచ్ఛతి సాఽలసా**
**తథా భక్తి యుతో భూత్వా ప్రదక్షిణ విధిం చరేత్!**

ప్రదక్షిణ అంటే.. అలసట లేకుండా.. ఏకాగ్రతతో.. స్థిర చిత్తంతో.. అడుగులో అడుగువేసుకుంటూ.. నిదానంగా నడవాలని స్మృతి చెబుతుంది. తొమ్మిది నెలలు నిండిన నిండు గర్భిణీ, జలంతో నిండిన నిండుకుండను తలపై ధరించిన ఓ సతీమణి అలసట లేకుండా ఎలా నడుస్తారో, అలా నడవాలని 'ప్రదక్షిణ' సూత్రం విశదీకరిస్తుంది. ప్రదక్షిణ విధానంలో ఎంత నిదానం వుంటే అది అంత ఎక్కువ ఫలితం పొందవచ్చునని విజ్ఞులంటారు.

**పదం పదాన్తరే న్యస్య ! కారౌ చలన వర్జితా!**
**స్తుతీర్వాచి హృది ధ్యానమ్! చతురంగ ప్రదక్షిణమ్!**

అడుగులో అడుగు వేసుకుంటూ అడుగు వెంబడి అడుగును అనుసరిస్తూ చేతులను కదిలించకుండా నిశ్చలంగా జోడించి హృదయంలో భగవంతుని ధ్యానిస్తూ వాక్కుతో స్తోత్రం చేస్తూ ప్రదక్షిణం చేయమని పెద్దలంటారు. దీనినే 'చతురంగ ప్రదక్షిణం' అంటారు.



సాధారణంగా ఆలయాలు తూర్పు ముఖంగా ఉంటాయి. ఆలయాన్ని చుట్టేటప్పుడు ఆలయం దక్షిణం వైపు ప్రారంభించి, ఉత్తరం వైపుగా చుట్టూ తిరుగుతాం కాబట్టి అది ఒక 'ప్రదక్షిణ' అవుతుంది. భగవంతునిపై భక్తి చాటుకోవడాన్కి ప్రదక్షిణ కార్యక్రమం ఏర్పాటు చేయబడుతుంది. ఏ గుడికి వెళ్ళినా.. మూడు ప్రదక్షిణలు చేయడం సత్సంప్రదాయం! సాధారణంగా ధ్వజస్తంభం నుండి ప్రారంభించిన ప్రదక్షిణ ధ్వజస్తంభం వద్దనే ముగియాలి.

సృష్టి, స్థితి, లయకారకులైన ముగ్గురు మూర్తులైన త్రిమూర్తులను స్మరిస్తూ చేసే ప్రదక్షిణలు మూడు! పంచ భూతాలలోనే పరమాత్మను అన్వేషిస్తూ పరంధాముని ఉనికి విశ్వసిస్తూ చేసే ప్రదక్షిణలు ఐదు!

నవగ్రహాలకు చేసే ప్రదక్షిణలకు ఒక విశిష్టత ఉంది. శాస్త్రప్రకారం ప్రదక్షిణకు అనుమతి కోరుతూ, తన వివరాలు తెలుపుతూ ఫలానా వాడిని ప్రదక్షిణకు వచ్చానని చెబుతూ చేసే ప్రదక్షిణం మొదటిది. నవగ్రహ అధిపతి అయిన సూర్యునికి చేసేది రెండవ ప్రదక్షిణం. ప్రదక్షిణలు చేయాలనే బుద్ధిని ప్రసాదించి నందులకు చేసే ప్రదక్షిణం మూడవది. ఇలా మూడు ప్రదక్షిణలకు అంతరార్థం ఉందని పెద్దలు చెబుతారు.

విశేష ప్రయోజనాన్ని కోరకుండా నవగ్రహాలకి సాధారణ దృష్టితో చేసే ప్రదక్షిణలు తొమ్మిది అనుకుంటే వానికి లాంఛనంగా చేసే మూడు ప్రదక్షిణలు కలిపి మొత్తం పన్నెండు చేయాలి. సూర్యుణ్ణి ఉద్దేశించి చేసేవి ఆరు. చంద్రునికైతే పది, కుజునికి ఏడు, రాహువుకు పద్దెనిమిది, గురువుకు పదహారు, శుక్రునకు ఇరవై, శని గ్రహానికి పందొమ్మిది, బుధునికి పదిహేడు, కేతువుకు ఏడు చొప్పున చేయాలని శాస్త్రం చెబుతుంది.

**ఏకం చండ్యాం రవే సప్త త్రిస్రోదద్యా ద్వినాయకే।**
**చతస్రో విష్ణవే దద్యా ఛ్ఛివేతిస్రః ప్రదక్షిణామ్ ॥**

## కార్వేటినగరము శ్రీ వేణుగోపాలస్వామివారి తెప్పోత్సవము

| | | | |
|---|---|---|---|
| 27-8-2015 | గురువారము | శ్రీ వేణుగోపాలస్వామివారికి | |
| 28-8-2015 | శుక్రవారము | శ్రీ వేణుగోపాలస్వామివారికి | శ్రావణపూర్ణిమ జరుగును. |
| 29-8-2015 | శనివారము | శ్రీ వేణుగోపాలస్వామివారికి | |

  

దేవికి ఒక్క ప్రదక్షిణం, రవికి ఏడు ప్రదక్షిణాలు, వినాయకుడికి మూడు ప్రదక్షిణాలు, విష్ణువుకు నాలుగు, శివునికి మూడు లేదా అర్ధ ప్రదక్షిణం చేయాలని లింగార్చన చంద్రిక చెబుతుంది. ఎవరికైనా మూడుగాని, ఐదుగాని, పదకొండుగాని, ఇరవై ఒక్కటిగాని ప్రదక్షిణలు చేయడం ఉత్తమమైనది.

సూర్యునికి రెండు ప్రదక్షిణలు, శివునికి మూడు ప్రదక్షిణలు, విష్ణువుకు నాలుగు ప్రదక్షిణలు, అశ్వత్థవృక్షమనబడే రావి చెట్టుకు ఏడు ప్రదక్షిణలు చేయమని ఆగమశాస్త్రం చెబుతుంది.

విష్ణువు ఆలయంలో యుగ్మ ప్రదక్షిణలు చేయమని ఆగమశాస్త్రమంటుంది. యుగ్మ ప్రదక్షిణలంటే సరి సంఖ్యలో ఉండే ప్రదక్షిణలు! రెండు, నాలుగు, ఆరు, ఎనిమిది మొదలైనవన్నీ యుగ్మ ప్రదక్షిణలే!

గృహస్థులు సవ్య, అపసవ్య ప్రదక్షిణలు చేయవచ్చని చెబుతారు. బ్రహ్మచారులు సవ్య ప్రదక్షిణం, సన్యాసులు అపసవ్య ప్రదక్షిణలు చేయవచ్చంటారు. కొన్ని సందర్భాలలో వివాహం కాని కన్యలు, ఇతర ఇబ్బందులలో ఉన్న వ్యక్తులు ఆ బాధ నివారణార్థం పెద్దలు సూచించిన పద్ధతిలో ప్రదక్షిణా కార్యక్రమం చేయమంటారు.

శివాలయంలో చేసే ప్రదక్షిణను 'చండీ ప్రదక్షిణ' అంటారు. శివునికి అభిషేకం చేసిన తరువాత నీరు బయటకు పోతున్న మార్గాన్ని 'సోమసూత్రం' అంటారు. దానినీ, నందీశ్వరుణ్ణి, ధ్వజస్తంభాన్ని కలుపుకొని చేసే ప్రదక్షిణ చండీ ప్రదక్షిణ అవుతుంది.

**చండ స్థానేతు సంకల్ప్య। వృషభాదేప్రదక్షిణమ్।**
**వృషభం చండం వృషంచైవ। సోమసూత్రం పునర్వంచ।**

చండీ ప్రదక్షిణ చండీశుని వద్ద ప్రారంభమై సవ్యంగా, ధ్వజస్తంభం వద్ద నున్న వృషభం దగ్గరకు వస్తుంది. అక్కడి నుండి చండీశుని వరకూ, మళ్ళీ అక్కడినుండి ధ్వజస్తంభం వద్దగల వృషభం వరకు వస్తుంది. అక్కడి నుండి సోమసూత్రం వరకూ, సోమసూత్రం నుండి వృషభం వరకు వస్తే అదీ చండీ ప్రదక్షిణ అని పిలువబడుతుంది. ఒక్క చండీప్రదక్షిణలో తొమ్మిది ప్రదక్షిణలు ఉంటాయి. శివానుగ్రహం లభించడం కోసం ఇలా చేసే చండీ ప్రదక్షిణ వలన విశేషఫలితం లభిస్తుందని భక్తుల విశ్వాసం.

**యాని కాని చ పాపాని। జన్మాంతరకృతాని చ।**
**తాని తాని ప్రణశ్యంతి। ప్రదక్షిణ పదేపదే।**

ఓ జనార్దనా! ఈ జన్మలో కాని, జన్మాంతరంలో గాని ఏవైనా పాపాలు చేసిఉంటే అవన్నీ ఈ ప్రదక్షిణ వలన నశించుగాక! పాప నివారణార్థం నేను పదే పదే చేసే ఈ ప్రదక్షిణలను స్వీకరించి నన్ను పాపవిముక్తుడిని చేయి!

**అన్యథా శరణం నాస్తి। త్వమేవ శరణం మమ।**
**తస్మాత్కారుణ్య భావేన। రక్ష రక్ష జనార్దన॥**

ఇక నాకు నీవు తప్ప దిక్కులేదు. ఎవరినీ నేను శరణం అర్థించలేను. నీవు మాత్రమే నాకు శరణం ప్రసాదించాలి. నీ కారుణ్య భావం వలన నా పాప పరికిలం నుండి నాకు విముక్తి కలుగుతుంది! రక్షించు! రక్షించు!' అంటూ చేసే ప్రదక్షిణలలో ఆత్మశోధన మొదలవుతుంది. ఆత్మ విచారణ ఆరంభమౌతుంది. ఏకాగ్రతగా చేసే సమయంలో చేసిన పాపాలన్నీ కనుల ముందు కదలాడతాయి. పాపాలు చేయకూడదనే కృతనిశ్చయం కలుగుతుంది. ఆత్మ ప్రక్షాళన జరిగి, పునీతమౌతుంది. చేయబోయే ముందే 'అది పాపమని' అంతరంగం ఆవిష్కరిస్తుంది. తత్ఫలితంగా పావనమైన జీవనం ప్రారంభమౌతుంది.







**యద్వా ద్వాదశ వారం వా నీత్వా ధామ ప్రదక్షిణం ।**
**ఏకైక వాద్య ఘోషేణ ప్రతివారం ప్రదక్షిణే ॥**

దేవేరితో కూడిన స్వామివారు వాహనమునందు తిరు వీధులలో ఊరేగే సమయములో ఏడు లేక పన్నెండు ప్రదక్షిణలు చేయాలని పురుషోత్తమ సంహిత చెబుతుంది. ఒక్కొక్క మారు ఒక్కొక్క వాద్యముతో ప్రదక్షిణ ఆచరించవలెనని వివరిస్తుంది.

**నవమం వేణు గానం చ దశమం సామగానకం ।**
**ఏకాదశంచ నృత్యం ద్వాదశం మౌన ముచ్యతే ॥**

భగవంతుని సంగీత, నృత్య. లలితకళా ప్రియునిగా పేర్కొంటూ వివిధ వాద్య నాదాలతో, సామగానంతో ఎప్పుడు ఎలా ప్రదక్షిణ చేయాలో ఆగమశాస్త్రం చెబుతుంది.

మొదటి ప్రదక్షిణం పంచవాద్యాలతో, రెండవది భేరీ వాద్య నినాదంతో చేయాలి. మూడవ ప్రదక్షిణం మృదంగంతో, నాల్గవది కాంస్య తాళంతో నిర్వహించాలి. ఐదవది ఘంటానాదం అయితే ఆరవది శంఖ ఘోషకం అవుతుంది. ఏడవది స్వరభేదం అయితే ఎనిమిదవది తుంబరనాదం అవుతుంది. తొమ్మిదవ ప్రదక్షిణం వేణుగానంతోనూ, పదవ ప్రదక్షిణ సామగానంతో చేయమంటారు. పదకొండవ ప్రదక్షిణ నృత్యంతో చేసి పన్నెండవ ప్రదక్షిణ 'మౌనధారణ' తో చేయమని వివరిస్తుంది.

**ఈశ్వరః సర్వభూతానాం । హృద్దేశే౽ర్జున తిష్ఠతి ।**
**భ్రామయన్ సర్వభూతాని । యంత్రారూఢాని మాయయా ॥**

అర్జునా! శరీరరూప యంత్రములందు పరమేశ్వరుడు ఉన్నాడు. సర్వప్రాణుల హృదయములందు భగవంతుడు అంతర్యామిగా కొలువైఉన్నాడు. తన మాయలచేత, వారి వారి కర్మలను అనుసరించి వారిని భ్రమింపచేస్తున్నాడు. సంభ్రమింప చేస్తున్నాడు. అదే ఆత్మ ప్రదక్షిణ పరమార్థం అని మోక్ష సన్న్యాస యోగంలో శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశిస్తారు.

దేవాలయంలో దేవుని చుట్టూ చేసే ప్రదక్షిణల మాదిరిగా, గృహంలో జరిగే పూజా పునస్కారాలలో, పర్వదిన ఉత్సవాలలో ఆత్మ ప్రదక్షిణ చేయడం అలవాటుగా నేడు సంప్రదాయమైంది. అనేక గ్రహాలు తమ చుట్టూ తాము ప్రదక్షిణ చేస్తూనే, ప్రధాన గ్రహం చుట్టూ తిరుగుతుంటాయి. అదే ఆత్మ ప్రదక్షిణ అంతరార్థం!



**ప్రదక్షిణం కరిష్యామి । సర్వభ్రమ నివారణం ।**
**సంసార సాగరానాదాత్మ ముద్ధరస్వ మహా ప్రభో ॥**

సర్వభ్రమ నివారణార్థం... సంసార సాగరాన్ని అవలీలగా ఇది మోక్షమనే ఆవలి తీరాన్ని చేరడాన్కి పదే పదే ఈ విధమైన ఆత్మ ప్రదక్షిణం చేస్తున్నానని ఆత్మ స్వరూపుడైన భగవంతునికి నివేదించుకుంటారు. ఆత్మ ప్రదక్షిణం శక్తి జనకమైనదే! కుడివైపుగా ప్రదక్షిణ ఆచరించడం వలన ఆత్మశక్తి పెరుగుతుంది. అడుగులో అడుగు వేసుకుంటూ, కుడి వైపుగా తిరుగుతూ చేసే ప్రదక్షిణలో అర్థము, పరమార్థమూ ఉంది. ఆత్మ శక్తి జాగృతమౌతుంది. ఆత్మ పరిశోధనకు అవకాశం కలుగుతుంది. ఆత్మ విశ్వాసం పెరుగుతుంది. వేగంగా శరీర భాగాలన్నింటికీ రక్తప్రసారం జరగడం వలన ఆరోగ్యం చేకూరుతుంది. జీవనానికి అందం, ఆనందం ఇస్తుంది.



**తిరుమలలో శ్రీవారి దర్శనానికి ముందు,**
**శ్రీవారి పుష్కరిణిచెంత వున్న**
**శ్రీవరాహస్వామివారిని దర్శించాలి.**
**ఇది అనాదిగా వస్తున్న సంప్రదాయం.**



# ఆధ్యాత్మిక ఆణిముత్యం 'మాతృశ్రీ'

డా॥ కె. ఆలంవలి, అనంతపురం, 9494057779

తెలుగు సాహితీ జగత్తులో విరిసిన అధ్యాత్మిక ఆణిముత్యం మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. చిత్తూరు జిల్లా, వాయల్పాడు. వాయల్పాడుకు ఉత్తరంగా నాలుగు కిలోమీటర్ల దూరంలో వున్న తరిగొండలో (క్రీ.శ.1730-1817) ఆమె జన్మించింది. తండ్రి కానాల కృష్ణయార్యుడు, తల్లి మంగమాంబ. చిన్నతనంలోనే వైధవ్యం పొంది అధ్యాత్మిక చింతనతో సర్వస్వం ఆ శ్రీనివాసుడే అని నమ్మి జీవితాన్ని ముందుకు సాగించింది. వెంగమాంబ గురువుల ప్రోత్సాహంతో 18 కృతులు రచించింది. అన్నీ అధ్యాత్మిక, భక్తి యోగ విషయాలకు చెందినవే! ఇందులో యక్షగానాలూ, సంకీర్తనలూ, స్తోత్రాలూ, పద్యకావ్యాలూ, ద్విపదరచనలూ ఉన్నాయి.

వెంగమాంబ ప్రతిరోజూ శ్రీనివాసుని దర్శించి, కీర్తించేది. ఆశువుగా వచ్చిన పద్యాలతో స్తుతించడంతో, ఆ భక్తురాలి తన్మయావస్థను చూసినవారు వెంగమాంబను మహాయోగినిగా భక్తురాలిగా కొనియాడేవారు. అయితే నిలువనీడలేక గుడి అవరణలోనో, మండపాల్లోనో తలదాచుకొంటున్న వెంగమాంబ పరిస్థితిని మాత్రం ఎవరూ పట్టించుకోనేవారు కాదు. అలాంటి సమయంలో ఆ పరమభక్తురాలు తిరుమల క్షేత్రంలోనే తనను స్థిరంగా ఉండేట్లుగా అనుగ్రహిస్తూ, ఒక ఆవాస ప్రదేశాన్ని చూపించవలసిందిగా శ్రీవేంకటేశ్వరుణ్ణి ప్రార్థించింది. అనాటి రాత్రి మండప ప్రాంగణంలో నిద్రిస్తూవున్న వెంగమాంబకు కలలో స్వామివారు కనబడి "వెంగమ్మా! మహిమాన్వితమైన ఈ వేంకటాచల క్షేత్రంలో నీవు ఉండదలిస్తే నాకేమి అభ్యంతరం లేదు. కానీ నా వక్షస్థలంలో కొలువై ఉన్న వ్యూహలక్ష్మిని వేడుకో! ఆమె సమ్మతిస్తే నీవు ఉండవచ్చు" నని ఆదేశించారు. తెల్లవారిలేచిన వెంగమాంబ ఆశ్చర్యపడి ఆనందంతో శ్రీస్వామివారి ఆజ్ఞగా అలమేలుమంగమ్మను ఉపాసించి, తిరుమలలో ఉండేందుకు అర్థించింది.

వారిరువురు వెంగమాంబ ప్రార్థనను అనుగ్రహించి తిరుమల క్షేత్రంలో ఆమెకు స్థిర నివాసం ఏర్పాటు చేయ సంకల్పించారు. శ్రీస్వామివారు తన ఆంతరంగిక భక్తుడైన స్వామీ హథీరాంబాబాజీవారి శిష్యపరంపరలో, మహంతు మఠానికి అప్పటి అధిపతిగా ఉండిన ఆత్మారాందాసుకు ప్రేరణ కలిగించాడు.

ఆత్మారాందాసు స్వయంగా వెంగమాంబ వద్దకు వెళ్ళి "అమ్మా! భగవత్సంకల్పం ఏమిటో కానీ, మీకు తిరుమల కొండమీద



**ఆగష్టు 24 తరిగొండ వెంగమాంబ వర్ధంతి**

  

నివాసం ఏర్పాటు చేస్తున్న సదుపాయాన్ని స్వీకరించి, భక్తవరుడైన శ్రీవేంకటేశ్వరుణ్ణి సేవిస్తూ, భక్తులను తరింపజేయగలరని" ప్రార్థించాడు. అనంతరం శ్రీవారి తూర్పుమాడవీధి చివరన ఈశాన్య మూలంలో శ్రీవారి రాతి రథం పక్కన ఒక పూరిగుడిసెను నిర్మించి ఇప్పించాడు. అంతేకాకుండా స్వామివారి ఆలయంలోని వంటశాలను, పిండివంటల తయారీని పర్యవేక్షిస్తున్న శ్రీవారి తల్లియైన వకుళమాత పేరిట ఒక పడి బియ్యాన్నీ దానికి తగిన ఇతర వంట వస్తువులను ప్రతిరోజూ తరిగొండ వెంగ మాంబకు పంపించేలా మహంతు ఆత్మారాందాసు తీర్మానించాడు. శ్రీవారి ఆలయ పరిపాలనను మహంతులు స్వీకరించ డానికి పూర్వం అంతకు మునుపు ఇంచుమించు నూరేండ్ల క్రిందట జరిగిన వృత్తాంతం ఇది. భక్త శిరోమణి వెంగమాంబ కూడా తన ప్రార్థనను ఆలకించి అనుగ్రహించిన అలమేలుమంగా వేంకటేశ్వరుల దయకు సంతోషించి, మహంతు ఏర్పాటు చేసిన సదుపాయాన్ని అంగీకరించింది.ఆలయం మూసిన వేళల్లో మాత్రమే తన కుటీరంలో స్వయంపాకం చేసుకొని శ్రీస్వామివారికి నివేదించి భుజించేది.

తులసీప్రియుడైన తిరుమలేశుని కోసం తనకుటీరానికి వెనుక దిక్కున పడమటి వైపున ఒక తోట, అందుకోసం ఒకదిగుడుబావిని తవ్వించింది. కాని, ఆ బావిలో అడుగున విశాలమైన బండ అడ్డుతగిలింది. వెంగమాంబ ఆ బావిలోకి దిగి గంగాభవానిని ప్రార్థించగా వెంటనే బావిలోని బండ బీటలు వారి గంగమ్మ పెల్లుబికింది. వెంగమాంబ మహిమకు ప్రజలంతా వేనోళ్ళపొగిడి హారతులు పట్టారు. ఆ దిగుడు బావి నీటిని పారించి, తీరికవేళల్లో వెంగమాంబ తులసీవనాన్ని పెంచింది. పూలమొక్కలు కూడా నాటింది. ఆ తోటద్వారా సేకరించిన పూలను, తులసిని మనోహరంగా దండలుగా కూర్చి ప్రతిరోజూ ఉదయం శ్రీస్వామివారి మూలమూర్తుల అలంకరణకు సమర్పించేది. శ్రీవారి సహస్రనామార్చనకు తులసిదళాల్ని సమకూర్చేది.

వెంగమాంబ చూపుతున్న మహిమలు, భక్తిరచనల చేత ఆమెమీద తిరుమలవాసులకు, యాత్రికులకు, అత్యంత భక్తి ప్రపత్తులు ఏర్పడినాయి. ఆమెచేత ఆశీస్సులను పొందడం, సాక్షాత్తు స్వామివారి అనుగ్రహాన్ని పొందినట్లే అని తిరుమలకు వచ్చే భక్తులందరూ భావించేవారు.

ఇలాంటి తరుణంలో వేంకటేశ్వర స్వామివారి సేవల్లో ప్రధానంగా పాలుపంచుకొంటూ ఉన్న పరమ భక్తులైన తాళ్లపాక అన్నమాచార్యుల వంశీయులు వెంగమాంబను గురించి, ఆమె మహిమలను, భక్తి రచనలను గురించి విన్నారు. పరమ భక్తురాలగుటచేత తాళ్లపాకవారు ఆమెను ఆహ్వానించి, ఉత్తరమాడవీధిలో శ్రీవరాహస్వామి ఆలయం వెనుక తాము నివాసం ఉంటున్న తమ ఇంటిలో కొంత భాగాన్ని ఆమెకు ఉచితంగా ఇచ్చారు. ఆనాటి నుంచి వెంగమాంబ తాళ్లపాకవారి అండన చేరింది. ఆ ఇంటి వెనుక ఒక తులసీవనాన్ని పెంచుతూ శ్రీవారికి తులసీమాలల కైంకర్యాన్ని నిర్వహిస్తూ నిత్యం ఆనందనిలయుని సేవలోనే కాలాన్ని గడుపుతూ వచ్చింది. శ్రీ వేంకటేశ్వరుని భక్తురాలైన వెంగమాంబ జీవితాంతం స్వామిని భక్తిప్రపత్తులతో సేవించింది. 

# భక్తశిఖామణులు

డా|| మరింగంటి లక్ష్మణాచార్యులు, హైదరాబాద్, 9640233930



ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీష శుక శౌనక భీష్మ దాల్భ్యాన్
రుక్మాంగదార్జున వసిష్ఠ విభీషణాదీన్
"పుణ్యా" నిమాం "పరమభాగవతాన్" స్మరామి.

పరమ భాగవతులుగా వీరు మన సంప్రదాయంలో గుర్తింపు పొందారు. ప్రతిరోజూ వీరిని మనం స్మరిస్తూ ఉన్నట్లైతే ఇహమూ, పరమూ రెండూ మనకు లభిస్తాయి. అంతేకాదు, భగవంతునికి తనను స్మరించే, ఆరాధించేవారంటే ప్రీతి ఉన్నా, తన భక్తులపైన, వారి సేవకులపైన (భృత్యస్య భృత్య పరిచారక భృత్య, భృత్యులపై) ఆయనకు పరమప్రీతి. ఆయనకు ఇష్టులైన పరమభాగవతులను స్మరించేవారంటే ఆయనకు ఎంతో వాత్సల్యం. అటువంటి పరమభాగవతుల కోవకు చెందినవారిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాం.

**1. ప్రహ్లాదుడు**



నారాయణునిపట్ల అచంచలమైన భక్తి, ప్రేమ, సహనం, సేవలకు నిర్వచనం ప్రహ్లాదుడు. అందుకే పరమభాగవతుల్లో మొదటిస్థానం దక్కించుకున్న మహాభక్తుడీతడు. రాక్షసవంశంలో జన్మించినా, దైవీగుణాలతో భాసిల్లిన కారణజన్ముడు. తల్లి గర్భంలో ఉండగానే, నారదమహర్షివల్ల నారాయణ దివ్యమంత్రాన్ని, తత్త్వాన్ని గ్రహించినవాడు. ఇతని తండ్రి హిరణ్యకశిపుడు, తల్లి లీలావతి. అసురవంశసంజాతుడైనా శ్రీమహావిష్ణువుకు పరమభక్తుడు. చండామార్కులు ఈతని గురువులు. హరినామం స్మరించవద్దని, హరిభక్తి వీడుమని తండ్రి హిరణ్యకశిపుడు ఎన్నోరకాలుగా హింసించినా, తనకున్న భక్తిని మార్చుకోక దృఢమైన విశ్వాసంతో నారాయణుని ఆరాధించిన పరమభాగవతుడు. దుష్టుడూ, సాధుజన వినాశకుడూ అయిన హిరణ్యకశిపుణ్ణి సంహరించేందుకై శ్రీమన్నారాయణుడు విచిత్రమైన, పరమభయంకరమైన నరసింహావతారం ధరించడం జరిగింది.

**2. నారదుడు**



నిరంతర హరినారాయణస్మరణచేస్తూ త్రిలోక సంచారంచేసే పరమభాగవతుడు నారదుడు. ఈయన విధాత (బ్రహ్మ) మానసపుత్రుడు. బ్రహ్మ ఇతర మానసపుత్రులంతా సృష్టికార్యాన్ని స్వీకరించగా, నారదుడు మాత్రం ఆ కార్యాన్ని తిరస్కరించి బ్రహ్మకోపానికి గురయ్యాడు. ఫలితంగా నారదుడు త్రిలోకసంచారి అయ్యాడు. అంతేకాక, పురాణాలప్రకారం వివిధ లోకాల సమాచారములు అందరికీ అందిస్తూ ఉండేవాడు. ఋగ్వేదంలోని ఎనిమిది, తొమ్మిది మండలాల మంత్రద్రష్ట నారదుడే. ఈయనకు కలహప్రియుడని, కలహాశనుడని పేర్లు. దేవ, దానవ, యక్ష, గరుడ, కిన్నర, కింపురుష, మానవాదులు అంతా ఈయనను గౌరవిస్తారు. ఎన్నో విద్యలకు ఆచార్యుడైన నారదుడు భక్తి ప్రచారకుడు. వీరి నారద భక్తిసూత్రాలు ఎంతో విశిష్టమైంది. భగవంతుని మనస్సే నారదుడు. నారాయణస్మరణమే నారదుని ఊపిరి. అందుకే పరమభాగవతుల్లో ద్వితీయస్థానం పొందగలిగాడు.

**3. పరాశరుడు**

మహాభాగవతుల్లో మూడవస్థానంలో ఉన్న పరాశరుడు గొప్ప భక్తుడే కాక శాస్త్రవేత్త కూడా. వసిష్ఠమహర్షి మనుమడూ, శక్తి-అదృశంతిల కుమారుడూ అయిన ఈయన గొప్ప తపస్వి. తల్లి గర్భంలో ఉన్నప్పుడే తండ్రినుండి బ్రహ్మాండపురాణం విన్న మహానుభావుడు. తరువాత దాన్నే ఆయన జాతుకర్ణుడనే వాడికి వినిపించాడు. బ్రహ్మపుత్రుడైన పులస్త్యుడు ఆయనకి శాస్త్రజ్ఞానాన్ని పూర్తిగా అందించిన తర్వాత ఈయన విష్ణుపురాణాన్ని వ్రాశాడు. పరాశరసంహిత ఈయన సుప్రసిద్ధ రచన. శ్రీవిష్ణుసహస్రనామంలో





**వ్యాసం వసిష్ఠ నప్తారం శక్తాః పౌత్రమకల్మషం ।**
**పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥**

అని ఈయన వంశంలోని ప్రముఖులందరినీ స్మరించు కోవడం జరుగుతుంది.

**4. పుండరీకుడు**

మహాభాగవతుల్లో నాల్గవస్థానంలో ఉన్న పుండరీకుడు గొప్ప భక్తుడే కాక, వేద, శాస్త్ర పారంగతుడూ, తపస్సంపన్నుడూ, స్వాధ్యాయపరుడూ, జితేంద్రియుడూ మరియు క్షమాగుణసంపన్నుడుగా కూడా పేరు పొందాడు. త్రికాల సంధ్యారాధకుడే గాక, ఉదయం, సాయంత్రం అగ్నిహోత్ర ఆరాధన కూడా చేసేవాడు. అంతేకాక, తల్లిదండ్రులను ఎంతో భక్తిశ్రద్ధలతో సేవించేవాడు. ఇక విష్ణు సంకీర్తనమైతే ఎల్లప్పుడూ కీర్తించేవాడు. ఈయన ధర్మానికి మూలం భగవంతుడనే చెప్పేవాడు. "రామో విగ్రహవాన్ ధర్మః" అని శ్రీరామచంద్రుణ్ణి, "ఏషధర్మస్సనాతనః" అని శ్రీకృష్ణపరమాత్మను మన పెద్దలు అన్నది ఇందుకే కదా!! ఇంతటి మహాభక్తుడు గనుకనే, నామసంకీర్తనల్లో "పుండరీకవరదా! గోవిందా గోవింద!" అని అనడం మనం వింటూ ఉంటాము.

**5. వ్యాసుడు**



మహాభాగవతుల్లో ఐదవస్థానంలో నున్న వ్యాసుని తల్లి సత్యవతి, తండ్రి పరాశరమహర్షి. ఒక నదిలో ఉండే ద్వీపంలో జన్మించిన కారణంగా ద్వైపాయనుడని, నల్లనిరంగుతో ఉన్నందున కృష్ణద్వైపాయనుడని పేరు పొందాడు. భారతంలో కృష్ణుడు (వాసుదేవుడు) కృష్ణ (ద్రౌపది) కృష్ణద్వైపాయనుడు (వ్యాసుడు) అని కృష్ణనామంతో ముగ్గురు మనకి కనిపిస్తారు. వ్యాసుడు గొప్ప తపస్సంపన్నుడుగా, దివ్యవరసిద్ధుడుగా, మహాపండితుడుగా, గొప్పరచయితగా, వేదముల పరిష్కర్త, విష్ణుసహస్రనామములను కూర్చి అమర్చినవానిగా మనకు పరిచితుడు. అంతేకాదు, అష్టాదశపురాణాలను, మహాభారతాన్ని రచించినవాడు. కాని మహాభాగవతం వ్రాసినపిదపే అంటే భగవత్తత్త్వాన్ని, భాగవతమహిమను విశదంగా వర్ణించిన తర్వాతనే తనకు శాంతి, ఆనందం కలిగాయని అన్నాడట! లోకంలో ఉన్న ప్రతివిషయమూ మహాభారతంలో ఉన్నదనీ, మహాభారతంలో లేనిది లోకంలోనే లేదనీ చెప్పబడినది. తన తల్లి ఆజ్ఞానుసారం అంబిక, అంబాలిక మరియు వారి దాసియైన పరిశ్రమికి సంతానంగా ధృతరాష్ట్ర, పాండురాజు, విదురుల జన్మకు కారణం అయ్యాడు.

**6. అంబరీషుడు**

ఇతను పరమభాగవతుల్లో ఆరవ స్థానాన్ని పొందినవాడు.



గొప్ప విష్ణుభక్తుడైన అంబరీషుడు ప్రాతః స్మరణీయుడు. 'ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాధనం పరం' (అన్ని ఆరాధనలలో కెల్లా విష్ణుభగవానుని ఆరాధన శ్రేష్ఠం) అన్న మాటను నమ్మినవాడు. ప్రకృతిలోని అణువు-అణువూ హరినామ కీర్తనే చేస్తున్నట్టుండేది అంబరీషుడికి. హరినామస్మరణతోనే నిద్రలేచి, తాను నిర్వర్తించే దైనిక రాచకార్యాలందు కూడా హరినామము విడువక, చివరికి హరినామస్మరణతోనే రాత్రి నిద్రకు ఉపక్రమించేవాడు. అంబరీషుని ఏకాదశీవ్రతకథ, ఆ సందర్భంగా దుర్వాసునిరాక, ఆయన స్నానమునకు వెళ్ళి తిరిగిరావడంలో ఆలస్యం అవడం, ఈలోగా ఏకాదశి గడియలుపోయి ద్వాదశిగడియలు సమీపిస్తున్నాయన్న భయంతో ఏకాదశీవ్రతం కొనసాగించడం, అప్పుడే వచ్చిన దుర్వాసుడు అది గమనించి ఉగ్రుడై అంబరీషుని వధించాలని 'కృత్య' అనే రాక్షసిని సృజించడం, అంబరీషుడు శ్రీమన్నారాయణుని ప్రార్థించగా ఆయన తన చక్రప్రయోగంతో కృత్యను సంహరించి ఆయనను కాపాడడం మొదలైనవన్నీ విదితమే! కాబట్టి అంబరీషోపాఖ్యానశ్రవణం భయనివారణోపాయంగా మరియు సుఖ, శాంతిప్రదాయికంగా లోకంలో పేరు పొందినది.

**7. శుకుడు**

మహాభాగవతుల్లో ఏడవస్థానాన్ని పొందిన శుకమహర్షి వ్యాస, ఘృతాచుల (అప్సరస) పుత్రుడు. ఒక సందర్భంలో ఈ ఘృతాచి చిలుకరూపంలో వచ్చి, వ్యాసభగవానుణ్ణి తనవైపు ఆకర్షింపచేసుకున్నది. ఫలితంగా వ్యాసుని వరంతో ఆమెకు జన్మించాడు శుకుడు. బృహస్పతి వద్ద వేదాధ్యయనం చేశాడు. పరీక్షిత్తుమహారాజుకు శ్రీమద్భాగవతాన్ని వినిపించింది శ్రీశుకులవారే! చిలుక ఒకరు అన్నమాటలనే ఏవిధంగా యథాతథంగా వినిపిస్తుందో

  

అదేవిధంగా పెద్దలు, ఆచార్యులు భగవత్తత్త్వాన్ని గురించి చెప్పినది, తాను విన్న కారణంగా దానినే పరమరమణీయంగా యథాతథంగా పరీక్షిత్తుకు చెప్పి అతడి మృత్యుభయాన్ని తొలగించాడు. శ్రీశుకుని నామస్మరణం దివ్యానందదాయకం.

**8. శౌనకుడు**

పరమ భాగవతుల్లో ఎనిమిదవవాడు శౌనకుడు. ఒక గొప్ప వేదవేత్తగా, ఋషిసత్తముడిగా పేరు పొందిన శౌనకుడు భృగువంశంలో జన్మించిన మహానుభావుడు. పన్నెండుసంవత్సరాల వరకు నిరంతరంగా కొనసాగిన ఒక గొప్పయజ్ఞాన్ని నిర్వహించిన ధర్మమూర్తి. ఈ యజ్ఞంలోనే ఉగ్రశ్రవసుడికి మహాభారతకథను వినిపించినవాడు. ఈయనే ధర్మావతారుడైన ధర్మరాజుకు వివేకావివేకములు, వైరాగ్య ప్రపత్తులను గూర్చి వివరించాడు. శౌనకుని బోధలు అనుస్మరణీయాలు.

**9. భీష్ముడు**

పరమ భాగవతుల్లో తొమ్మిదవవాడు గంగాశంతనుల కుమారుడు భీష్ముడు. ఈయన అసలు పేరు దేవవ్రతుడు. వసువులలో చివరి ఎనిమిదవ వసువు అవతారమైన భీష్ముడు తన అన్నలందరివలె జన్మించినపుడు, ప్రాణత్యాగము కాకపోవడంతో కౌరవవంశరక్షకుడుగా, తండ్రి కీర్తికి కళంకం రాకూడదని తనకి వివాహమే లేకుంటే, సంతానం కలిగే ప్రసక్తియే ఉండదనిభావించి, తన తండ్రి మనసుపడి వివాహం చేసుకున్న సత్యవతి కోరికపై అంబిక, అంబాలిక మరియు వారి దాసికి కలిగిన ధృతరాష్ట్ర, పాండురాజు, విదురులను, ఆ తరువాత, ధృతరాష్ట్ర, పాండురాజులకు కల్గిన నూటఐదుమంది సంతానాన్ని (కౌరవులు, పాండవులు) పెంచి పెద్దచేసి వారికి రాజ్యం కట్టపెట్టిన త్యాగశీలి. మహాభారతయుద్ధంలో కౌరవపక్షాన నిలచి పాండవులతోనే సమరం చేశాడు. చివరికి అంపశయ్యపై ఉత్తరాయణఘడియలు వచ్చే వరకూ ఉన్నాడు. ఆ సమయంలోనే శ్రీకృష్ణుని ఆదేశానుసారం ధర్మరాజుకి విష్ణుసహస్రనామాలను బోధించాడు. ఉత్తరాయణం ప్రవేశించాక తన పాంచభౌతికశరీరాన్ని వదలి స్వర్గస్థుడయ్యాడు.

**10. దాల్భ్యుడు**

ఈయన పరమ భాగవతుల్లో పదవస్థానాన్ని ఆక్రమించిన వాడు. తన తీవ్రతపస్సుతో లోకారాధ్యులైన శ్రీసీతారామచంద్రులను సాక్షాత్కరింపచేసుకున్న మహాభక్తుడు దాల్భ్యుడు. దత్తాత్రేయ భగవానుని ఉపదేశాలంటే ఈయనకు అత్యంతగౌరవం. దత్తాత్రేయుల వారిని నిరంతరం స్మరించేవాడు. ఈయన భగవద్భక్తి ఎంత గాఢమైనదంటే ఆ భక్తిలో పడి సర్వమూ మరచిపోయేవాడట. తరువాత ఆయన "దాల్భ్యసంహిత" ను రచించాడు. ఇది ఒక విలక్షణమైన గ్రంథం. ఆధిదైహిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక బాధలను పోగొట్టి సర్వకార్యసిద్ధిని ప్రసాదించే విశేషాలన్నీ ఈ గ్రంథంలో పొందుపరచబడ్డాయి. దత్తాత్రేయకృపను పొందిన దాల్భ్యుడు ధన్యాత్ముడు.

**11. రుక్మాంగదుడు**

రుక్మాంగదుడు 11 స్థానంలో ఉన్నమహాభక్తుడు. నారదపురాణంలో ఈయన గురించి వివరించబడినది. శ్రీమహావిష్ణువుకు పరమభక్తుడైన ఈయన ఒక ప్రజారంజకుడైన రాజు. ప్రతాపవంతుడు. మహారాజు ఋతుధ్వజుని కుమారుడు. వివాహితుడైనా, పుత్రోదయమైనా తామరాకుమీది నీటిబొట్టువలె సాంసారికసుఖములలో ఉన్నా వివేక, వైరాగ్య ములతో జీవనం కొనసాగించాడు. ప్రజలకు తనను ఒక సేవకునిలా భావించేవాడు. కాలక్రమంలో వైరాగ్యంతో రాజ్యభారాన్ని కుమారుడైన ధర్మాంగదునికి అప్పగించి తాను హిమాలయములకు వెళ్లి, అక్కడ తీవ్రమైన తపస్సులో మునిగిపోయాడు. శ్రీమన్నారాయణ చరణారవిందధ్యానము వినా, మరొకటి ఆయనకు రుచించేదికాదు. చివరికి దైవనామస్మరణతోనే తనువు చాలించిన మహాభక్తుడు రుక్మాంగదుడు.

**12. అర్జునుడు**

మహాభాగవతుల్లో పంద్రెండవ స్థానాన్ని పొందినవాడు. పాండవమధ్యముడైన అర్జునుడు మహావిలుకాడు. సవ్యసాచి. దివ్యశస్త్రాస్త్రసంపన్నుడు. ద్రోణాచార్యులవారి ప్రధానశిష్యుడు. స్వయంవరంలో ద్రౌపదిని, ఆ తరువాత సుభద్రను, ఉలూచిని, చిత్రాంగదని పరిణయమాడాడు. అన్నింటికన్న శ్రీకృష్ణుని అభిమానమును చూరగొన్న భాగ్యశాలి. సమవయస్కుడైన

  

అర్జునుడంటే శ్రీకృష్ణునికి ఎంతో ప్రేమ. కురుక్షేత్రసంగ్రామంలో నిరాశకు, నిర్వేదానికి, మోహానికి గురై, క్షత్రియధర్మమైన యుద్ధమునుచేయనని, వారంతా నావారని, వారిని నేను చంపలేనని కూలబడిపోయాడు అర్జునుడు. అప్పుడు శ్రీకృష్ణుడు వివరించిన ఆధ్యాత్మికవిశేషాలను, కర్తవ్యకర్మల ఆచరణ ప్రాధాన్యతను, నిష్కామకర్మవైశిష్ట్యాన్ని, శరణాగతి ప్రాముఖ్యతను, ఆత్మస్వరూపాన్ని, తత్త్వాన్ని గ్రహించి తిరిగి కర్తవ్యోన్ముఖుడైనాడు. అర్జునుని నిమిత్తంగా చేసుకునే శ్రీకృష్ణపరమాత్మ లోకానికి 'భగవద్గీత' వంటి దివ్య ఆధ్యాత్మిక గ్రంథాన్ని అందించాడు.

ఉరుములు మెరుపులతో కూడిన వర్షపుధాటికి పిడుగుపడినప్పుడు అర్జునునికి గల పది పేర్లను స్మరించడం పరిపాటి. అవి:"అర్జునః, ఫల్గుణః, పార్థః, కిరీటిః, శ్వేతవాహనః, ధనంజయః, జిష్ణుః, సవ్యసాచిః, బీభత్సః, విజయ" మొదలైనవి. అందుకే ఈయనను గొప్ప హరిభక్తుడిగా అభివర్ణించడమైనది.

### 13. వసిష్ఠుడు



మహాభాగవతుల్లో 13వ స్థానాన్ని పొందిన వసిష్ఠుడు మహాతపస్సంపన్నుడు. ఇక్ష్వాకుల కులగురువు. వేదములప్రకారం ఇతను మిత్రమహర్షి, వరుణాదంపతుల కుమారుడు. ఈయన సత్త్వగుణసంపన్నుడు. అవిరళ జప, హోమతత్పరుడు. వేదములలోని అనేక మంత్రముల ద్రష్టగా కూడా ఈయనకు గుర్తింపు ఉన్నది. బ్రహ్మర్షి అన్న బిరుదు వీరి విషయంలో సార్థకమైనది. గొప్ప బ్రహ్మజ్ఞానవేత్త. అంతేకాదు, దివోదాస మహారాజుకు, అటులనే దశరథమహారాజుకు ఆ తరువాతి తరాలవారికి కూడా పురోహితునిగా ఉన్న ధన్యజీవి. విశ్వామిత్రునితో రామలక్ష్మణులను పంపడానికి తటపటాయిస్తున్న దశరథ మహారాజుకు నచ్చచెప్పి, శ్రీరాముని పరాక్రమాన్ని, విశ్వామిత్రుని విలక్షణత్వాన్ని వివరించి చెప్పిన బుద్ధిశాలి, వివేకవంతుడు. శ్రీరామచంద్రుని గురువైన ఆయన ఉపదేశ సంగ్రహమే యోగవాశిష్ఠము. అద్భుతమైన ఆధ్యాత్మిక, వేదాంతగ్రంథం ఇది.

### 14. విభీషణుడు



మహాభాగవతుల్లో 14వ స్థానాన్ని పొందిన పులస్త్యబ్రహ్మ మూడవ కుమారుడు, లంకాధినేత రావణబ్రహ్మ చిన్నసోదరుడు అయిన విభీషణుడు ప్రహ్లాదునివలెనే రాక్షసులకుల సంజాతు డైననూ వారివలె కాక సత్త్వగుణమును, ధార్మికచింతనను, అహింసాప్రవృత్తిని అన్నింటికి మించి శ్రీరామభక్తిని తనలో నింపుకున్న మహాభక్తుడు. బాల్యమునుండియే తనలోని ప్రత్యేకతను చాటుకుని అన్నగారి అకృత్యములను, అవకాశం దొరికినప్పుడల్లా విమర్శిస్తూ ఖండించిన పరమసాత్త్వికుడు. అన్నగారి దుష్ప్రవర్తన హద్దులు మీరడం చూసి, చివరకు అతనిని వదలి శ్రీరాముని శరణుజొచ్చిన ఆదర్శజీవి. క్రోధోన్మత్తుడైన రావణునిబారినుండి హనుమను కాపాడినవాడు. రామరావణయుద్ధసమయంలో శ్రీరామునిపక్షాన నిలబడి వారి విజయానికి కారణమైనవాడు. రావణవధానంతరం లంకాసామ్రాజ్యానికి అధిపతి అయినవాడు. శ్రీవైష్ణవులకత్యంత ప్రాధాన్యమైన శ్రీరంగంలో రంగనాథుని అవతరణకు కూడా విభీషణుని పాత్ర ఉన్నది. విభీషణుడు కేవలం పేరులోనే భయంకరత్వాన్ని సంతరించుకున్నవాడు కాని, యదార్థముగా పరమధార్మికుడు. దయాగుణశోభితుడు. సత్త్వతేజోసంపన్నుడు. శ్రీరాముని మహాభక్తుడైన ఆంజనేయునికి కూడా అత్యంత ఆప్తుడుగా నున్నవాడు.

భారతీయ ఆధ్యాత్మికసంపదను, తమ సమకాలీనులకే కాక భవిష్యత్తరాలవారికి కూడా పంచి, అందరిలో ఆధ్యాత్మికజ్యోతిని వెలిగించి, జీవితానికి అర్థం, పరమార్థం తెలియజేసి, ఆదర్శమయమైన జీవితాన్ని గడిపిన వీరంతా మనకు అనుస్మరణీయులు!

## రణ వీరాంజనేయ శతకము

**రచయిత :** ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యం

**వెల:** అమూల్యం; **సైజు:** 1/8 డెమ్మి; **పుటలు:** 68

**దొరకుచోటు:** ధూళిపాళ ఆదినారాయణ,

ఇంటి నెం.4-66, ఐఎల్‌డిటి కాలనీ, కొత్తపేట,

చీరాల - 523 157, ప్రకాశం జిల్లా, ఆంధ్రప్రదేశ్

సెల్ 8790305434

హనుమంతుడులేని రామాయణాన్ని ఊహించలేము. వాగ్భూషణంలో, చాకచక్యంలో, కార్యసాధనలో, సాహసకార్య నిర్వహణలో, భక్తి తత్పరతలో, సమయస్ఫూర్తిలో ఆయనకు ఆయనే సాటి. ఇన్ని సుగుణాల రాశిగా వెలిగాడు కాబట్టే చిరంజీవిగా నిలిచిపోయాడు. కోరిన కోర్కెలు తీర్చే దేవుడిగా భక్తులమదిలో చిరస్థాయిగా నిలిచిపోయాడు. ఆ భగవానుని స్మరిస్తూ, కీర్తిస్తూ ఎందరో రచయితలు, కవులు లెక్కలేనన్ని రచనలు చేశారు. ఎందరు రాసినా వారి ప్రత్యేకత వారిదే. ఎంత రాసినా తనివి తీరని భక్తులు తమ తృప్తికోసం హనుమంతునిపై రచనలు చేస్తూనే ఉన్నారు. ఆ కోవలో వెలువడిందే ఈ రణవీరాంజనేయ శతకము. ఈ గ్రంథకర్త ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యం.

ఈ శతకంలో నూటఎనిమిది సీసపద్యాలున్నాయి. యడ్లపాట్పురీ నిలయ! శ్రీ ఆంజనేయ! అనే మకుటంతో ఈ శతకం నడిచింది. ఇందులో శ్రీ హనుమంతుని గుణగణాలు అద్భుతంగా చెప్పబడ్డాయి. ఆంజనేయస్వామి జననం మొదలు సీతారామలక్ష్మణులతో అయోధ్యకు చేరేంత వరకు ఆ దేవుని లీలలను కళ్లకు కట్టినట్లు చిత్రించాడు కవి. కపులలో జన్మించి ఘనకార్యాలు సాధించాడని, సుగ్రీవబంటుగా లంకకు వెళ్లి సీతమ్మజాడ కనిపెట్టాడని, రామభక్తుడిగా రావణుని వధించాడని, రోమ రోమములో రామనామాన్ని నిక్షిప్తం చేసికున్నాడని హనుమను కవి శ్లాఘించాడు.

సరళశైలిలో రచించబడిన ఈ శతకం ఆధ్యాత్మికవిదులను భక్తి రసంలో ఓలలాడిస్తుందని చెప్పవచ్చు. దళసరి కాగితంపై ముద్రించబడింది. ముఖచిత్రంగా ఉన్న ఆంజనేయస్వామి చిత్రపటం ఆకర్షణీయంగా ఉంది. హనుమ భక్తులకు ఇది కరదీపికగా దోహదపడుతుంది.

*- కె.ఆర్.శ్వేత*

# గ్రంథసమీక్ష

## ఆత్మ సంవాదాలు

**రచయిత :** దోనెపూడి వెంకయ్య

**వెల:** 75/-; **సైజు:** 1/8 డెమ్మి; **పుటలు:** 158

**ప్రతులకు :** రమణభక్తమండలి ట్రస్టు,

రెండవఫ్లోర్, నెం.377, ఎఫ్ బ్లాక్, 12వ క్రాస్,

16వ మెయిన్, సహకార నగర్,

బెంగుళూరు - 560092, ఫోన్ : 9035315104

ఒక జిజ్ఞాసువు మరియు రమణసాధనాక్రమంలో పరిపక్వము చెందిన ఒక సాధకుడిమధ్య జరిగే సంభాషణలే ఈ ఆత్మసంవాదాలు. ఇందులో యాభైఐదు అంశాలున్నాయి. రమణనిలయం, రమణవనం, శాస్త్రపాండిత్యం శాస్త్రవాసన, గ్రంథరచన ఎందుకని సజీవగురువు శ్రీరమణులే, మనం ముక్తులమే, నిత్యసిద్ధముక్తివంటి అంశాలున్నాయి. ఒక్కొక్క అంశంపై ప్రశ్నలు-సమాధానాలు ఉన్నాయి. ఇవన్నీ రమణమహర్షి తత్వాన్ని తెలియచేసేవిగా ఉన్నాయి. వీటికి ఆధ్యాత్మిక దృక్పథంతో దోనెపూడి వెంకయ్యరాశారు. వీరు రమణమహర్షి భక్తాగ్రేసరులు. ఇందులోని ప్రశ్నలు సమాధానాలు కూడా వెంకయ్యగారివే. భక్తులకు కలిగే సందేహాలను ప్రశ్నలరూపంలో మలచి వాటికి చక్కని సమాధానాలిచ్చారు వెంకయ్యగారు.

ఇందులోని ప్రతిప్రశ్న తాత్వికులకు కూడా అర్థంగానిదేనని చెప్పవచ్చు. ఆధ్యాత్మిక, తాత్వికాంశాలు తెలిసినవారికి మాత్రమే ఇవి చక్కగా బోధపడతాయి. 'తలపుల అడ్డు తొలగించేది ఎవరు?' అనెడి ప్రశ్నకు 'నేనెవన్ని' అని తెలుసుకోవటమేనని జవాబిస్తాడు. నీవెవరు అన్న ప్రశ్నకు నేటికీ ప్రపంచ తత్వవేత్తలే సమాధానం చెప్పలేకున్నారు. ఇలాంటి ప్రశ్నలు - వాటికి తగిన జవాబులు సుమారు మూడు వందలవరకూ ఈ గ్రంథంలో ఉన్నాయి. ఈ గ్రంథం రమణమహర్షి భక్తులేగాకుండా ఆధ్యాత్మిక వేత్తలందరూ చదవదగింది.

*- సి. కుప్పయ్య*

